# ఆంధ్రపత్రిక

సచిత్ర వార పత్రి




ANDHRA PATRIKA ILLUSTRATED WEEKLY



"కోడి కూసింది"

ఫోటో : టి. రామారావు—రాజమండ్రి.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 48
సంచిక 41
15.6-55

మన్మథ జ్యేష్ఠ దశమి తృతీయ బుధవారం



ఉదయ సంధ్యాకాంతిలో
ఉర్వి మెరిసినది.

—ఫోటో : కిరపనేని కుటుంబరావు - మద్రాసు

# ఏకాంకికలు

తెలుగు భాషా సమితి వారు 1954 లో జరిపిన పోటీలో బహుమతి పొందిన కుమారి గుడిమెళ్ళ బాలా త్రిపురసుందరిగారి ఆరు ఏకాంకికలను త్వరలో ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో ప్రచురింపగలమని తెలుపుటకు ఆనందిస్తున్నాము.

కుమారి బాలా త్రిపురసుందరి గారు ఇదివరలో "గృహ విజ్ఞాన శాస్త్రము" అను గ్రంథమును రచించి తెలుగు భాషా సమితి వారి బహుమతి గల్చినారు.

—సంపాదకుడు.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : బొంబాయి తార "సులోచన"



జూన్ 1 వ తేదీ వారపత్రిక ముఖచిత్రం "ముస్తాబు" ఫొటో పంపినవారు శ్రీ డి. వి. యస్. సోమయాజులుగారు, కాకినాడ.

# సౌదర్యం

## 1

బండి కదుల్తోంటే—

కాదు, బండిలోంచి రమాదేవి చెయ్యి ఊపుతూ పుట్టింటికి వెడుతున్నానని చెప్తోంటే శ్రీదేవి హృదయం చివుక్కుమంది. గుండె గతుక్కుమన్నది. గొంతు గురగుర లాడింది.

ఏం చెయ్యటానికీ తోచక చటుక్కున ఇంట్లోకి వెళ్లి కొత్తగా కుట్టించుకున్న జాకెట్టూ, ఇంత పసుపూ - కుంకం కాగితంలో పోసి చుట్టబెట్టేసి ఓ - క్క అంగలో బండీ దగ్గరగా వచ్చి రమాదేవి చేతిలో ఉంచుతూ : 'తొందరగా వస్తావుకదూ!'

అతి ప్రయత్నంమీద వణుకుతూ, వణుకుతూ ఉన్న కంఠంతో అనగలిగింది శ్రీదేవి.

'ఇవన్నీ ఏవిటే, చాల్లే'.

పెదవులను ద్విధా విభజిస్తూ, బుగ్గల మీదకు మధ్యవేలూ, బొటన వ్రేలూ పోనిచ్చి నొక్కుకుంటూ ముక్కు మీదకు తర్జనీ నడిపింది, రమాదేవి

'ఇక్కడింక మన కెవరుంటారు గనక! నీకు నేనూ, నాకు నువ్వూ ఇలాటి వేవో జరుపుకోకపోతే. త్వరగా తిరిగి రావాలి సుమా? రాకపోతే నా తోడే'

మరీ నెమ్మదిగా పలికింది శ్రీదేవి కంఠం.

రమాదేవి కొద్దిగా చకిత అయింది. చకిత అయినా నిబ్బరించుకుని :

'త్వరగానే వస్తానే, ఇంక దిగడు'

అని చెయ్యి పట్టుకుని దోసిట్లో బిగించి వదిలింది రమాదేవి. బండి నడుస్తూనే ఉంది. బండి ముంగు నడిచే రమాదేవి అన్నయ్య బండివాణ్ణి తొందర పెడ్తూనే ఉన్నాడు.

బండి సందుమలుపులోకి వచ్చేసింది.

ఆగిపోయింది శ్రీదేవి.

శ్రీదేవి కాదు శ్రీదేవి కాళ్లు ఆగిపోయినవి.

ఆమె కన్నులు మాత్రం నడుస్తూనే ఉన్నవి. రమాదేవి కన్నులు శ్రీదేవి ముక్కుపుటాలకు తగ్లోసి లాగుతూనే ఉన్నవి. మల్లెమొగ్గలాంటి రమాదేవి మునిపళ్లు చిరునవ్వు కాంతులను జిమ్ముతూనే ఉన్నవి. ఆమె కన్నులలో ఏవేవో భావాలు ప్రవహిస్తున్నవి.

శ్రీదేవి అడుగు కదపలేకపోయింది.

అలానే నిలబడి చూస్తూన్నది. రెప్ప వెయ్యకుండా చూస్తూ నిలబడిపోయింది.

బండి వేగం హెచ్చి జోరుగా సాగిపోతూన్నది.

కొంతవరకూ రమాదేవి రూపం స్పష్టంగా కనిపించి, రానురాను స్పష్టాస్పష్టం అయి, అస్పష్టమయిపోయి బండిమాత్రం కనిపించి, కనిపించేబండిలో రమాదేవిరూపం ఉన్న ఊహామాత్రం మిగిలింది. బండి పెద్ద బజారులోకి మళ్ళిపోయింది.

"మాఘమాసం వెళ్ళేవరకూ రమాదేవిరాదు"

గొంతుక్కీ, పెదవులకీ మధ్య నలిగిపోయి శ్రీదేవి గజగజ ఊపేసిం దా వాక్యం.

కనుగొలకుల్లో బిందువులు నిల్చినవి.

కొనసాగిన ముక్కు చివర ముత్యంలా నిలబడిం దొక బిందువు.

---

## ఉషశ్రీ

శృంగాటకంలో (నాలుగురోడ్లు కలిసే చోటు) మట్టమధ్యాహ్నం ఒంటిగా నిలబడ్డాననే స్పృహ వచ్చేసరికి నఖశిఖ పర్యంతం ముణుముకుపోయింది.

చరాలున వెనుదిరిగి, నాలుగడుగుల్లో యింట్లోకివచ్చేసి, ధనాల్మని తలుపులు వేసేసి, పట్టె మంచంమీద వాలిపోయి తలగడాలో ముఖం ముంచేసింది.

అప్పుడప్పుడూ గాలికి కదిలే తలుపు చప్పుడు రమాదేవి తిరిగి వచ్చేస్తోందన్న భ్రమకు కారణమయి రెండుమూడుసార్లు నిరాశనే కలిగించింది.

కన్నీటితో తలగడా తడిసి ముద్దకుండానే నిద్ర పట్టేసింది.

ఖచ్చితమయిన నిద్రే పట్టింది శ్రీదేవికి. లేకపోతే ఏదో ఓకల వచ్చేది. ఒక పేమిటి రెండుమూడు కలలు వచ్చేవి.

కలలో...

పుట్టింటికి వెళ్ళినట్టో,

వెళ్లటానికి ప్రయత్నిస్తున్నట్టో,

ఉన్నట్టుండీ భర్త వెళ్లటానికి వీల్లేదంటారన్నట్టో,

అటూ, యిటూ కాకపోతే యింటిదగ్గర ఎవరూ కదలటానికి తీరికలేదు కనకనున్నూ, తమ్ముడు సరిగ్గా భోగినాటికే వస్తాడు కనుక నున్నూ భర్తతో బయలుదేరిరావటం కానీ, ఆయనకుతీరిక లేకపోతే స్వయంగా రైలెక్కి ఇక్కడ దిగమనో - అన్నయ్య ఉత్తరం వ్రాసినట్టో - అలా వ్రాసిన ఉత్తరాన్ని పదేపదే చదువుకుంటూ కులుకుతూ, పొంగిపోతూన్నట్టో ఎట్టెట్టో కలవచ్చేది. అదీ కాకపోతే అన్నయ్యే స్వయంగా వచ్చినట్టూ, రావటంకూడా తెల్లవారుఝాం బండిలోదిగి, తాను ధనుర్మాసపు రంగవల్లులు దిద్దుతూండగా ప్రత్యక్షమయినట్టూ, ఆ మధ్యాహ్నమే భోజనాలదగ్గర 'బావా,

# ★ సౌదర్యం ★

పెద్దవుంటుక్కీ మీ యిద్దర్నీ తీసికెడదామని వచ్చాన్రా' అనగా ఆయన ముభావంగా ఊరుకోనేసరికి తనగుండె గుభేలుమన్నట్టూ, ఆ తరువాయి తన అనురాగాన్ని అంతనూ తనలోనే ఉంచుకొని మామూలుప్రకారం తమలపాకులకు సున్నం రాసి చిలకలు చుట్టి యిస్తూంటే, నిర్లక్ష్యంగా ముభావంగా ఆయన పేపరు చదువుతూనే కూర్చుని, రాత్రి పొద్దుపోయాక మిద్దిగదిలోకి వెళ్ళి గోడమూలనున్న చాప పరుచుకుని పైటచెరుగే తలక్రింద పెట్టుకొని పడుకున్నా నిద్రపట్టక బాధపడుతున్నా, ఆయనగుర్రుకొట్టి నిద్రపోతున్నట్టూ.. యిలా యిలా - యిలా - ఎలానో ఓలా కలలొచ్చేవి. రావలసిన కల ఏదీరాకుండానే అవాఙ్మానస గోచరానుభూతి పరంపరలను ప్రసాదించే స్వర్గసుఖతుల్యమయిన నిద్రలో ఉన్నది శ్రీదేవి.

## 2

శ్రీదేవి ఉలిక్కిపడి లేచింది.

లేచిన శ్రీదేవి లేస్తూనే పైటచెంగు సరిజేసికొని, చెంగుతోనే ముఖం తుడుచుకుని, దొడ్లో నూతి పళ్ళెం దగ్గరకు వెళ్ళి శుభ్రంగాముఖంతోముకుని, కాళ్ళూచేతులూ కడుక్కుని, అద్దం ముందు నిలబడి రేగిన ముంగురులు దువ్వెనతో సరిజేసుకొని, చిన్న కుంకుమ బొట్టుపెట్టుకొని సరిదిద్దుకుంటూండగా వీధి తలుపు దగ్గర ఉలికిడయింది.

'అన్నయ్య!'

అనుకుంటూ, లేడిలా గదిలోంచి వసారాలోకి వచ్చి తలుపు తీసింది.

'ఊఁ...హూ'

నీరసం పడింది శ్రీదేవి హృదయం.

పొరుగు వాటాలో ఉన్న సుబ్బులక్ష్మి చెల్లెలు సుశీల.

"మంచి నిద్రలో ఉన్నట్టున్నారు అత్తయ్యగారు, ఇందాకా ఎన్నిసార్లు పిల్చినా పలకనే లేదు. మా అక్కా ఈ చెమ్చాతో నాలుగు చెమ్చాల కాఫీ పొడుం యిమ్మందండీ. సాయంకాలం బావ తేగానే..." అంటూ సుశీల అడుగులువేసి వచ్చి కుర్చీమీద కూర్చుంది.

శ్రీదేవి ఏమీ మాట్లాడకుండానే సుశీల చేతులోంచి చెమ్చా, గిన్నీ తీసికొని వంటింట్లోకి నడిచింది.

వంటింట్లోకి వెడుతూండగా ఏదో బండి తన గుమ్మంముందు ఆగుతుందని, ఆగుతుందనేమిటి! ఆగిందనే అనిపించింది.

అనిపించినంతలో బండీవచ్చిఆగుతుందా?

ఆగదని తెలిసికోలేనంత అమాయకురాలు కాదు శ్రీదేవి.

అమాయకురాలు కాదుకాని అంతవరకూ శ్రీదేవి ఆలోచించటానికి అంగీకరించదు.

బండివచ్చి ఆగాలనేది శ్రీదేవి ఆశ.

ఆశకూ ఆలోచనకూ, ఆలోచనకూ అది అవటానికీ ఎంతదూరం ఉందో!

'రమత్తయ్యగారు వెళ్ళిపోయినట్టున్నారు. ఇంక మీకేం తో చదనుకుంటాను.'

భడవ!

వచ్చింది వచ్చినట్టూ ఆగక, తనపని తాను చూసుకోక, ఈ గుంటనక్కకి అవన్నీ ఎందుకూ?

మాట కాస్తా అని ఊరుకుందా!

ఊరుకుంటే అది సుశీలే కాదు, అనా ఊరుకునేది! హామ్మో!

అవులిస్తే పేగులు లెక్కెట్టే భడవ!

సరిగ్గా శ్రీదేవి తనవైపు చూసేసరికి చిలిపిగా కళ్ళుమూసి నాలుక కొరుక్కుంది.

శ్రీదేవి గుండెలో గుచ్చుకుంది.

ఆపిల్లమీద తన కోపాటి[illegible]ధికారం ఉన్నా చీల్చి చెండాడి, మాడ్చి మామాయి వండేసేది. అంతా చెయ్యకపోయినా చేసినట్టని పించగలిగేది.

"నాలుగు చెమ్చాలు చాలా ... ఇంకో రెండు..."

నాలుగో చెమ్చాతీస్తూ శ్రీదేవి అడిగింది.

కాఫీ పొడుం ఎన్ని చెమ్చాలు కావాలో సుబ్బులక్ష్మయ్యకు తెలుసు. తెలిసినన్ని చెమ్చాలూ తెమ్మని పంపింది సుబ్బులక్ష్మయ్య. సుబ్బులక్ష్మయ్య చెప్పినట్టూ చెప్పేసింది సుశీల. అంతకుమించి ఒక్క రవ్వకూడా శ్రీదేవి ఇవ్వనవసరం లేదు. ఇవ్వటమే కాదు, ఇంక ఆ విషయమై ప్రసంగించటం అనవసరం. అనవసరం కనకనే సుశీలకు పెద్ద చికాకువచ్చింది.

"అయిదో చెమ్చా డబ్బాలోకి పోనివ్వనక్కర్లేదండి అత్తయ్యగారూ! అసలు యింకోగంటలో బావ ఎలానూ తెస్తాడు. అయినా ఆయన వచ్చే వేళకు ... తిరిగితిరిగి వస్తాడుకదూ! వెధవది... ఆఆఫీసు ఎక్కడో జగన్నాథపురంలో తగలేశారు. మనమేమో ఈమూల గాంధీనగరంలో ఉన్నాం. రోజూ సిటీబస్సుకి వేడపోనూ, వేడరానూ ఎక్కడ తగలేస్తాం. తగలెయ్యనూవచ్చు జీతం సరిపోతే...

"ఈశ్రూటుకు ఈ పొడుం అప్పుచేసి కాఫీ పెట్టకపోతే ఏం మునిగిపోతుందే అని అడిగానుసుమండీ. కస్సుమని మీద పడింది. పడి 'ఊరుకుందా! నీకేం తెలుస్తుందే. రేపొద్దున్న నీ మొగుడు కాపురాని కొచ్చాక .... ఏమిటో అలాగే నాలుగూ అనేసింది. ఏం చెయ్యమంటారూ?' 'పెద్దలు చెప్పినట్టు వినవలెను' అన్నారు కనక..."

అని వాక్యాన్ని మధ్యలోనే త్రుంచేసి, రెండు చేతులూ కట్టుకుని మూతి ముణిచేసి బెదిరిపోతూన్నట్టు అభినయిస్తూ, అభినయిస్తున్నట్టు తెలిసేట్టూజేస్తూ ఒక్క క్షణం నిలబడి ఫకాల్న నవ్వేసి, కాఫీ పొడుం తీసుకుని జర్రున జెర్రిపిల్లలా జారేసింది.

ఊచలా దూసుకుపోయే సుశీలవైపే చూపులు నిలిచింది శ్రీదేవి. నిజానికి సుశీలకేం తెలుసూ? శ్రీదేవి హృదయంలోని బాధ శ్రీదేవికే తెలుసు. గడప దాటేసిన పిల్ల కొంప మునిగిపోయినట్టూ వెనుదిరిగి వచ్చి: "అత్తయ్యగారూ, రాత్రి ఎనిమిదింటికి రేడియోలో మాంఛి నాటిక ఉంది. రమత్తయ్య గారింట్లో విందాం. అత్తయ్యగారు లేకపోయినా మావయ్యగార్ని నే నడుగుతా."

అంటూనే శ్రీదేవి సమాధానం వినకుండా చక్కాపోయింది. వాకిట్లో మడత మంచం వాల్చుకుని, కాళ్ళు కిందికి వ్రేలాడేసి మోచిప్పలమీద మోచేతులుంచి అరచేతుల్లో చిబుకం, బుగ్గలు బిగించుకుని శూన్యంలోకి చూస్తూ కూర్చుంది.

## 3

మూడో సంక్రాంతి!

గతించిన రెండు సంక్రాంతులూ కులాసాగానే వెళ్ళాయి. వెళ్ళాయంటే వెళ్ళాయంతే!

కులాసాగా, హాయిగా వెళ్ళాయా అంటే, వెళ్ళాయనే అనుకోవాలి. అవి వెళ్ళిపోయాయి కనుకనూ...మళ్ళీ రావు కనకనూనూ.

అప్పట్లో కూడా మనస్సు చివుక్కుమందేమో! ఏమో అంత గుర్తులేదు శ్రీదేవికి.

అదీకాక, అప్పటికింకా వదినమీద కోపం పోలేదేమో, ఆ దృష్టే ఉండేది కాదు.

ఇప్పుడు అల్లా కాదు.

ఇప్పుడూ అలానే ఉండేది.

ఉండేది కానీ, రమాదేవి అన్నయ్యవచ్చి రమాదేవిని తీసికెళ్ళటంతో వచ్చి పడింది బాధ. అన్నయ్యగారు వచ్చి ఎంతో ఆప్యాయంగా రెండుగోజులుండి చెల్లెల్ని పుట్టింటికి తీసికెళ్ళేటప్పుడుండే అనుభూతి శ్రీదేవి ఎరగదు. కాని రమాదేవి ముఖంలో అదంతా చూచేసరికి రెండు కన్నీటి చుక్కలు జారి చిటికినవ్రేలి ఉంగరంమీదనుంచి ఒడిలోకి ప్రసరించినవి.

దుఃఖం పొంగి వచ్చింది.

జలజల రాలాయి బాష్పకణాలు.
విలవిలలాడింది మనస్సు.
వెలవెలపోయింది ముఖం.
గిరగిర తిరుగుతోంది అసలు కథ.

* * * *

'పొద్దున్నే పదింటికి నాలుగు మెతుకులు కొట్లో వేసుకు వెళ్లి ఈ పొద్దుదాకా ఆఫీసు పని చూసుకొచ్చిన మనిషికి కాస్తంత కాళ్లు కడుక్కుందికి చెంబెడు నీళ్లివ్వలేవుటే, ఆయనంతటి ఆయన చేదతో తోడుకోవాలా చాల్చాల్లే, రేపోమాపో కాపరానికి వెళ్ళబోతున్న దానివి ... ఆపాటి తెలవొద్దుటే శ్రీదేవీ!"

అంది వదిన—అద్దంముందునిలబడి రాత్రి ఏడింటికి అలంకారం సాగించుకుంటూన్న శ్రీదేవితో.

బొడ్డులోంచి తారాజువ్వలా దూసుకొచ్చిన కోపం దట్టింపు సరిగాలేని చిచ్చుబుడ్డిలా ముక్కు చివరదాకా వచ్చి చీదేసింది.

శ్రీదేవి సినిమాకెళ్లి వారం రోజులయింది. మళ్ళీ వారాని కీనాడు బయల్దేరబోతుంటే వదిన కెంత బాధో.

అసలు ఆవిడకు శ్రీదేవి సినిమాకు వెడుతున్నట్టు ఎలా తెలుసో? ఎందుకు తెలీదూ!

రాత్రి ఏడుఘంటల వేళ పుట్టింటి దగ్గర ఉన్న పడుచుపిల్ల చాకింటి మడతలు సింగారించి అలంకారాలు సాగిస్తుంటే యింకెక్కడికి వెడుతుందనుకుంటారేమిటే?

అదే వదిన బాధ.

శ్రీదేవి సినిమాకు వెళ్ళటం వదినకు బాధకాదు కాని అన్నయ్య కష్టార్జితాన్ని యిలా దుబారా చేయటం ఆవిడ కిష్టం లేదు.

హూమ్మ్!

వదినదెంత దుర్బుద్ధీ.

అన్నయ్యా, తను స్వయానా ఓ తల్లి కడుపున పుట్టిన బిడ్డలు.

మరి వదిన?

వదినంటే అన్నయ్య పెళ్లాం!

అంతగా వస్తే మావయ్య కూతురు.

అంతేకదా.

మావయ్య కూతురికే అన్నయ్య సంపాదన మీద అధికారం ఉంటే అన్నయ్యతోపాటు అమ్మ కడుపున బుట్టిన తనకెంత స్వాతంత్ర్యం ఉండాలి?

అదీకాక అన్నయ్య సంపాదనలో తను చేసే దుర్వినియోగం ఏమీలేదే. తీరాచూస్తే వారానికోసారి సినిమా అంతేగా.

మహా అయితే వారానికంతకూ కలిపి అర్థో, రూపాయో పువ్వుల ఖర్చు.

ఆ ఖర్చు వదినకీ ఉండేది; ఇప్పుడంటే బాలింతరాలు కనకా...

పోతే మొన్నటి దాకా హైస్కూల్లో తన చదువుక్రింద అన్నయ్య ఖర్చుపెట్టలే. ఈ ఏడాదినుంచి అది మిగులేగా. అయినా మరి వదినకెందుకో అక్కసు.

మహాఉంటే - యింకా ఈ కొంపలో - ఓ నెల ఉంటేను, రెణ్ణెల్లుంటేను. ఆ తరువాయి కూడా వచ్చి వదిన తన స్వేచ్ఛను అరికడుతుందా? హాయిగా తనూ, తనభర్తా కలిసి సైకిల్ రిక్షామీద వారానికి మూడు సినిమాలు చూస్తారు. అప్పుడు కాని వదినకి బుద్ధిరాదు. అనుకుంటూనే శ్రీదేవి వీధిలోకి నడిచింది.

ఇంత ఆలోచించిన శ్రీదేవికి వదిన తననేమన్నదో అర్థంకాలేదు. అనవసరంగా వదినమీద లేనిపోని అపోహలు కల్పించుకుంది.

* * * *

ఇంకోసారి...

"ఆయన చేతులు కాల్చుకుంటుంటే చూస్తూ కూర్చోకపోతే ఈపూటకి కాస్త నువ్వు వండి వార్చరాదుటే."

అంది జ్వరంతో మంచంమీదున్న వదిన.

చీకటి జువ్వలా వళ్ళంతా పాకింది కోపం.

స్కూల్ ఫైనల్ ప్యాసయిన శ్రీదేవిని..

రేపో, మాపో కాపురానికి పోబోయే శ్రీదేవిని...

తన సంతానానికి వండిపెట్టమంటుందా వదిన? ఎంత లోకువైపోయానూ' అనుకుంది శ్రీదేవి.

అసలిన్నాళ్లూ వదినకు జవాబివ్వకుండా వదలటమే యింతవరకూ తెచ్చింది.

ఉడకేసి పారేసిందాకా ఉండి యింట్లో ఉన్న గచ్చకాయకూ, నత్తకాయకూ కలిపి కంచాల్లో పెట్టి, చేతులూ మూతులూ కడిగి ఎంగిళ్లు ఎత్తేసరికి రాత్రి పదవుతుంది. అప్పుడింక ఆకలేం ఏడుస్తుందీ? నిద్దరేం పడుతుందీ?

ఈ చాకిరీ అంతా ఎవడు చేస్తాడు వీళ్లకు.

తక్షణం - నిలబడ్డపళంగా - బయలుదేరి రమ్మని 'ఆయన'కు టెలిగ్రాం యిద్దామనుకుంది. మామూలు టెలిగ్రాం ఏమిటీ, ఎక్స్‌ప్రెస్సే యిద్దామనుకుంది.

అనుకుందంతే!

'నిద్రపోతున్నావేమిటే శ్రీదేవీ, అయ్యో, రెండు మెతుకులు తినేసి పడుకోవే, వేసంకాలం రాత్రి నీరసంకూడా వస్తుంది' అంది వదిన.

ఎంత చులకన!

తన గదిలో తాను కూర్చుని నవల చదువుకుంటూంటే, యింకా మేజామీద అలారం టైంపీస్‌లో చిన్నముల్లు ఆరుదాటినా పెద్దముల్లు తొమ్మిదిమీదుండగా 'నిద్రపోతున్నావా?' అని అడుగుతుందా. ఎంతలోకువ కట్టేసింది.

ఈసారి ఊరుకుని ఏదో ఓజవాబివ్వాలి.

ఓజవాబేం ఖర్మ!

మళ్లీ వదిన పెదవి కదలకుండా చెయ్యాలి.

'ఒరే బాబిగా, అత్తయ్య నిద్రపోతున్నట్టుందీ, లేపి తీసికొచ్చి మీరిద్దరూ ముందు తినేయండి'

ఈమాట వదిన గొంతులోంచి ఎంత నీరసంగావచ్చిందో అంత కారంగానూ తగిలింది.

ఛర్రున కుర్చీలోంచి లేచి నిలబడింది.

వేళ్లు విరుచుకుంది.

మూతి ముప్పైమూడువిరుపులు విరిచింది.

రుసరుసలూ - విసవిసలూ సాగనిచ్చింది.

కోపం ఉరకలేవేసి, నురగలున్నా కక్కింది.

ఆ ఆవేశంలో వంటింటి గుమ్మందాకా వచ్చి, కంఠ పూర్తిచేసుకుని:

"రేపు తొమ్మిది గంటల బండికి నన్ను పంపించెయ్యరా. ఆయన్ని స్టేషన్‌కురమ్మని టెలిగ్రాం యియ్యి' అంది శ్రీదేవి.

తెల్లబోయాడన్నయ్య.

ఒక్కక్షణం మాటే ఆడలేకపోయాడు. ఆడలేకపోయినా శ్రీదేవికోరిక నెరవేరింది.

* * *

నిజానికిప్పుడాలోచిస్తుంటే...

అమ్మపోయినప్పట్నుంచీ, ఒక్కగానొక్క చెల్లెల్నికదా అని అన్నయ్య ఎంతో యిదిగా పెంచాడు. వంటిమీద ఈగవాలితే సహించేవాడు కాదు. వదినని కూడా ఏమీ అననిచ్చేవాడు కాదు. అన్నయ్య ఏనాడూ తన యిష్టానికి వ్యతిరేకం చేయలేదు. వదినమాత్రం! శ్రీదేవి బండెక్కుతూంటే వదిన అంది:

"ఇన్నాళ్ళూ నిన్ను నా చెల్లెల్లా చూసుకున్నాను. చిన్నతనంచేత నీ కర్థంకాక కోపంతో వెడుతున్నావు. నువ్వు ఎప్పుడు రాదలచుకున్నా నీ కభ్యంతరంలేదు."

ఈ వాక్యంతో శ్రీదేవి శరీరం నిండా తేళ్ళూ, జెర్రులూ పరువులు తీసినవి. పరువులుతీసి ఊరుకోలేదు, గూడుపట్టుమీద ఒక్కపోటు పొడిచేశాయి.

గిర్రున తిరిగింది కన్నీరు.

అన్నయ్యా! వదినా!

శ్రీదేవి రాత్రి జనతాకు వెళ్ళటానికి బెడ్డింగు సర్దుకుని భర్తతో చెప్పినప్పుడు అతని వదనంలో చిరునవ్వు ప్రసరించింది.

★

# చావాలని.

అతడు చావాలనుకున్నాడు ఎందుకు తన జీవితాన్ని అంతం చేయాలనుకున్నాడో తెలియజేయటం అనవసరమనుకుంటాను. ఈనాడు ఎందరో ఆత్మహత్యలు గావించుకొంటున్నారు అలాంటి వాళ్లను (శవాలనే అనుకోండి!) ఎందరినో చూస్తూవున్నాము వాళ్ళ విషయం ఇతర్లు చెప్పగా వింటున్నాము పత్రికల్లో చదువుతున్నాం అలాంటప్పుడు అతను ఎందుకు చావాలనుకున్నాడో నేను చెప్పడం బావుండదు అందుకు మీరేదయినా కారణం వూహించండి మీరు విన్న యే కారణాన్నయినా అతని కంటగట్టండి నా కభ్యంతరం లేదు మీరు ఎక్కడో చదువుకున్న దాంట్లో రిపేట్ కావచ్చు లేక మీకు తెలిసిన కారణాలన్నింటినీ కూడి వొక "యావరేజ్ కాజ్" (*Average cause*) కనిపెట్టి దాన్ని యూనివర్సల్ కాజ్ గా (*Universal cause*) యితనికి అప్లయి చేయండి బాధలేదు నామటుకు నేను ఇలా చేసి ఆత్మహత్యలు చేసుకునే వాళ్ళందరు "కోరికలు తీరక" అని నిర్ధారించుకున్నాను కాబట్టి యితని పేరు ప్రస్తుతానికి 'కోరికలు తీరని రావు' అయితే మన కో. తీ. రావు చావాలనుకున్నాడు. చావాలనుకోడమే కాదు అందు కెన్నో ప్రయత్నాలూ-ఆలోచనలూ చేశాడు

ఎలా చావడమన్నది అతనిలో మొలకెత్తిన మొదటి ప్రశ్న. అతని అభిప్రాయంలో తాను బాధపడకుండా వొకరికి ముప్పు తెచ్చిపెట్టకుండా చావాలని అందుకే కారుక్రింద అమాంతంగా పడి చావాలనుకున్న అభిప్రాయాన్ని మార్చుకున్నాడు బస్సుకు బస్సే బోల్తాపడ్డా ముంగన్న డ్రైవరూ, కనకవుంటే కండక్టరూ చావకుండా బయటపడటం అతను విన్నాడు కాళ్ళూ చేతులూ తెగినా చావకుండా జీవితాంతం బాధపడేవాళ్లను తాను చూస్తూనే వున్నాడు అదీగాక తాను కారుక్రిందపడితే పోలీసులు యిక ఆ డ్రైవరును పట్టుకొని, కోర్టుకు లాగి శిక్ష వేయిస్తారేమో! ఎవరికి యే ముప్పూ రాకుండా తాను ఆత్మహత్య చేసుకోబోతున్నానని వో వుత్తరం రాసి జేబులో వుంచుకుందామనుకున్నాడు ఆ వుత్తరం ఎవరయినా చూస్తే! పోలీసుల చేతుల్లో పడితే .. అరెస్టు చేస్తారు. అలా అయితే ఎంత అప్రతిష్ట. ఇక తాను తలయెత్తుక తిరగ్గలడా !

రైలుక్రింద పడితే ఎవరికీ యే బాధా వుండదు పట్టాలపైన అడ్డంగా పడుకుంటే తల వొకవైపు, కాళ్ళు యింకోకవైపు మొండెం పట్టాల మధ్యా వుండిపోతుంది అదయినా నిముషంలో జరిగే పని, ఎవరికీ ఎలాంటి ముప్పూ వుండదు. అందులో అర్ధరాత్రి ఎక్స్‌ప్రెస్ వెళుతున్నప్పుడయితే మరీ బావుంటుంది సినిమా రెండో ఆట ఆఖరు సారిగా చూచి మరీ చావవచును అదే మంచి ఆలోచన అనుకొన్నాడు కో. తీ. రావు

నీళ్ళల్లో పడి చావాలనుకున్నాడు గాని తనకు యీత వచ్చు గనుక అది అంత సులభంగా సాగదు. ఉరిపోసుకు చస్తామంటే అది మరీ బాధ. పది పన్నెండు నిముషాలు తన్నుక చావాలి విషం తాగితే ఫరవాలేదు కాని ఎవరయినా తనభార్యపైన హత్యా

## శేష్యరెడ్డి

నేరం మోపుతారేమో! ఇంకా ఎన్నో ఆలోచించాడు అతనికి యేదీ సాగలేదు ఎక్స్‌ప్రెస్, రైలుపట్టా రాత్రి ఒంటిగంటన్నర టైము—యివే అతని కళ్లముందు కదలాడుతున్నాయి. ఆ విధంగా, తనకు బాధ లేకుండా యితర్లకు కష్టం కలిగించకుండా, రైలుక్రిందపడి చావాలనుకున్నాడు తీర్మానం జరిగింది. ఇక ఆచరణ తరువాయి

చావాలనుకున్న వాడికి ఎంత మనో నిబ్బరం వుండాలి! అందుకు తగ్గ "వుత్సాహం" (చావాలన్న కోరిక బలంగా వుంటే దాన్ని యేమంటారో నాకు తెలియదు) ఎంతో వుండాలి. అందుకు తాను చేసిన మొదటిపని—అసలు తానెందుకు చావాలనుకున్నాడో వాటి నన్నింటినీ మననం చేసుకోటం తానను భవించిన కష్టాలు, పడుతున్న యాతనలు—జరిగిన అవమానాలు, కలిగిన అపజయాలు, అన్నింటినీ వొక్కసారిగా జ్ఞప్తికి తెచ్చుకున్నాడు తాను గురియౌతున్న వేళన—తన ప్రస్తుత జీవితం నెమరువేసుకొన్నాడు. అన్నింటనీ వొక్కసారిగా తన మెదడులోకి తెచ్చుకోడంవల్ల అది వేడెక్కిపోయి కుతకుత వుడికి, పొగలు కక్కి, యిక భరించలేక "చావు" "చావు" అని ఘోషించింది ఆస్థితిలో అతనికి ఆత్మహత్య చేసుకోవాలన్న గట్టి పట్టుదల కదిలింది అంగుకే తన అభిప్రాయంలో ఉత్సాహం తగ్గకుండా ఉండటానికి—వాటిని జత చేసి మాటి మాటికీ మననం చేసుకోసాగాడు ప్రోత్సాహం కలిగించడానికి గాను తన రుచికి సరిపోయే కథలనే, పుస్తకాలనే చదివాడు, అలాంటివి అతనికి కుప్పతిప్పలుగా దొరికాయి

అది ఆనాడు తను చావాలనుకొన్న రోజు. రాత్రి ఎనిమిదిన్నర అవుతుంది. తను చావడానికి కావలసిన ధైర్యాన్ని, ప్రోత్సాహాన్ని కూడదీసుకొన్నాడు ఆ అభిప్రాయం నుంచి యిక తొలిగిపోలేనన్న నిబ్బరం కలిగాక గదిలోంచి బయటికొచ్చాడు భార్యామణి ఎదురయింది. తన మూడేళ్ల వివాహ జీవితంలో ఎలాంటి సానుభూతీ చూపని ఆవిడ నేడెందుకో ప్రేమతో తనవేపే చూస్తున్నట్లనిపించింది. మంచంలో నిద్రపోతున్న బిడ్డలో తనకంత మార్పేమీ పొడగట్టలేదు చీకటి పడిగాని రానని చెప్పి బయటపడ్డాడు బజార్లో యింటి యజమాని ఎదురు పడ్డాడు ఆర్నెల్లనుంచి అద్దె యెగబెడుతూవుంటే, ప్రతి రోజూ, ఎదురయినప్పుడల్లా, ఎక్కడ పడితే అక్కడ కిరాయివిషయం గోల చేసిగాని వదలిపెట్టని ఆ పెద్దమనిషి యీ వాడెందుకో తన్ను చూచి తలవంచుకొన్నాడు అతని వెంబడి పోలీసు జవాను, తనకు తెలియని యింకెవరో వున్నారు. పోలీసును చూపగానే మనవాడికి కంపరమెత్తింది గబగబా అడుగులు వేసుకుంటూ వెళ్లాడు పిక్చర్‌పాలస్ వేపు క్యూలో నిలుచున్నాడు కౌంటరుదగ్గర కొని తనకు జేబులో చిల్లిగవ్వ లేదన్న సంగతి స్ఫురణకు రాలేదు పాలిపోయిన ముఖంతో వంచిన తలతో - మెల్లగా అక్కడినుండి జారుకున్నాడు ఆఖరుసారిగానైనా తాని నాటి సినిమా చూడలేకపోతున్నందుకు ఎంతో వ్యథ చెందాడు ఆరు నెల్ల క్రితం చూచిందే ఆఖరు చిత్రం కాబోలు.

తను సినిమా చూడలేకపోవటమన్నది అతని ఆత్మహత్య నిర్ణయానికి మరీ ప్రోత్సాహకరంగా తయారయింది అతని హృదయాన్ని కెలికి, తాను మూడేళ్లనుండి అనుభవించిన వ్యర్థ వ్యథిత జీవితం తాను చూడాలనుకున్న సినిమాలా కనిపించింది జనసమ్మర్దంలో నిలువలే[illegible]డు. వచ్చే



"ఏరువాక సాగాలోరన్నో, చిన్నన్న!"

ఫొటో వి తంబి - కర్నూలు

పోయే జనం, బస్సులూ బళ్ళూ, వాటి రొద అతన్ని చీకాకుపరచాయి. వీటన్నింటినీ తప్పించుకు పారిపోవా లనుకున్నాడు. పారిపోయి మళ్ళీ వీటిమధ్యకు రాదల్చుకోలేదు. చావాలనుకున్నాడు.

ఎక్స్‌ప్రెస్ ఒంటిగంటన్నరకయితే, నాల్గుమైళ్ళు ఆయాసపడి నడిచి పదకొండు గంటలకే చేరుకున్నాడు అనుకున్న చోటికి. చుట్టూ జనవాసం కాదుకదా జనసంచారం కూడా లేదు వొక మైలుమేరవరకు. అంతా అడవి, ముళ్లు, కటిక చీకటి. కీచురాళ్ళ ధ్వని - అప్పుడప్పుడూ వాటిని అణచివేసే వింతవింత చప్పుడులు. చుట్టూ అంధకారం- ఆ పరిస్థితుల్లో రైలుకట్ట యెక్కాడు, పట్టాలపైన అడ్డంగా వెల్లకిలా పడుకున్నాడు. మెడ వొక పట్టాపైన వుంది. తొడలు యింకొక పట్టాపైన. మెడ పట్టా వత్తిడివల నొప్పిపెట్టకుండా వుండేందుకు కండువా మడిచి దిండుగా పెట్టుకుని దానిపైన చేతులానించి, అరచేతులపైన మెడను ఆనించాడు. సర్ది పడుకొని ఆలోచనలో పడ్డాడు...

తా నిప్పుడు చనిపోబోతున్నాడు. అందుకెంతో కాలం పట్టదు. తను చనిపోయింతరువాత తనవాళ్లేమనుకుంటారో... తెలియని జనం యేమనుకుంటుందో...

అమ్మ యేడుస్తుంది. తల బాదుకుంటుంది. ఎందుకు? కన్నకడుపు గనుక.

భార్య విచారిస్తుంది. అశ్రువులు అర్పిస్తుంది—ఎందుకు? తను లేని జీవనం ఆమెకు నిరర్థకం, అంధకారం గనుక.

చుట్టు అందరూ చేరి ఏడుస్తూవుంటే బిడ్డ నివ్వెరపోయి చూస్తుంది-పాపం ఆచిట్టి తండ్రి లేని పిల్ల అవుతుందికదూ—

తన తండ్రి కంట తడిపెట్టుకుంటాడు యీ వార్తవిని.

మిత్రులకు తెలిస్తే 'అయ్యో' అనుకుంటారు.

తెలియనివాళ్లు "ఏం కష్టం వచ్చిందో పాపం! పడుచువాడు బలవంతాన ప్రాణాలు తీసుకొన్నాడు" అంటారు.

చుట్టుపల్లె అమ్మలక్కలు ఏవో గుసగుసలు సాగిస్తారు.

ఇదీ తను వూహించిన మొదటి దృశ్యం.

తను లేకపోతే తనవాళ్లు పడే బాధ - వాళ్ళ జీవితం యెలా గడుస్తుందో వూహించబోయాడు. తనుండగానే కష్టంగా గడిచే సంసారం, తను లేకుండా సాఫీగా నడవటం కల్ల. ఆ కష్టాలు అవి ఆలోచిస్తూవుంటే అతని హృదయంలో యేదో తెలియని బాధ ఆవేశం మొదలయింది. అశ్రువులు అనంతంగా కారసాగాయి. ఆలోచన ఆపివేశాడు.

అప్పటికి వొంటిగంట అయింది. ఎక్స్‌ప్రెస్ రావటానికి యింకో అరగంటే వ్యవధి. ఆఖరిసారిగా తనవాళ్లెలావున్నారో ఊహించాడు...

అది తన యిల్లు. భార్య, రెండేళ్ల పిల్ల యిద్దరే వున్నారు. నిద్రలోంచి పసిపాప లేచి "నాన్నా — నాన్నా" అంటూ యేడుస్తూంది తల్లి యెంత సముదాయించినా వినటం లేదు మూర్ఖంగా వొహటే

చావాలని...

గోల "నాన్నా - నాన్నా" అని తల్లి మాత్రం యేం చేస్తుంది తల బాదుకొంది తనూ యేడ్చింది బిడ్డ ఆకలికి మరీ యేడ్చింది. కేవలం నాన్నకోసమే కాదు

ఇంటి యజమాని వచ్చాడు కోరచూపులు చూచుకుంటూ వెంబడి పోలీసు, కోర్టు అమీనా, యింకో నలుగురు యెవరో వున్నారు ఇంట్లో సామాన్లు బయట వేస్తున్నారు బిడ్డను చంకనెత్తుకొని ఆమె అడ్డం పోయింది. అందరూ ఆమెను తొలగమన్నారు మగవాళ్లు వచ్చేంతవరకు సామాన్లు ముట్టేందుకు వీల్లేదంది ఆమె వాళ్లు ఎవరూ లేరు హుంకరించారు గద్దించారు కసిరారు ఆమె అడ్డం తొలగలేదు ఇంటి యజమాని పౌరుషంగా ఆమెను అవతలకు నెట్టివేశాడు. దాంతో చంకలోని బిడ్డ జారి పడడంవల్ల, గడపకు తలకొట్టుకొని బొప్పికట్టింది నెత్తురు కారటం లేదు ఆ దెబ్బకు స్తంభించిపోయిన బిడ్డను చంకనెత్తుకొని, పళ్ళు నిమురుతూ—కోపం—అవమానం-ఏడుపూ-కలిసిన గొంతుతో అరుస్తూ (అయినా మాటలు అంత పెద్దగా వినరావటం లేదు) దౌర్జన్యంగా సామాన్లు బయటపెట్టిస్తున్న యింటి యజమానికి అడ్డంపోయింది మన కోటీ రావు మెదడులో యీ దృశ్యం మెదలుతూవుంటే, ఫర్లాంగు దూరంలో నుండే ఎక్స్‌ప్రెస్ లైటు కళ్లు మిరిమిట్లుగొలుపుతూ పట్టాల మీదుగా ముందుకు వడివడిగా వస్తోంది ఆకాసేడియన్ ఇంజన్ బ్రహ్మాండమైన కూతకు, దగ్గరలో యెంత నిబ్బరంగానైనా, రైలుకట్టాపైన పక్కగా నడుస్తున్నవాడు గుండె అదిరి, యింకా పక్కకు తొలగి, ఒదిగి నిలబడిపోతాడు కాని పాపం మనవాడికి ఆ కూత వినపడ్డట్టుకూడా లేదు అదే దృశ్యం అతని బుర్రలో మెగులుతూవుంది ఇంటి యజమాని యెదురుగా అడ్డం నిలిచిన తన భార్య యెదురు రొమ్ముపై చెయివేసి వెనక్కి నెట్టబోతున్నాడు తాను జీవించి వుండగానే యింతటి అవమానమా దగ్గరలో యింజను కూత - రైలు చప్పుడూ భరింపరానిదిగా వుంది ఇంటి యజమాని తన భార్యను భుజం పట్టుకుని గెంటివేశాడు పిల్లతో సహా ఆమె వెనక్కు తూలి పడిపోయింది. దగ్గరలో వున్న విసురు రాయికి తలకొట్టుకోడంవల్ల నెత్తురు కారుతున్నది బిడ్డ భోరున యేడుస్తున్నది ఇక సహించలేకపోయాడు ఇగా తాను జీవించివుండీ చేతులు కట్టేసుకొని కూర్చుంటడం తన అప్రయోజకత్వాన్ని లోకానికి చాటు

సీరియల్

# ఉదయ కిరణాలు

పోతుకూచి సాంబశివరావు

## 4

శ్రీ కంపెనీ ఆఫీసుగదిలో కూర్చుని అవధాని ఆలోచించడం మొదలు పెట్టాడు. నరసింహం ఇంటికి తిరిగి వస్తాడా రాడా అని అతని భయం. పంపించిన స్నేహితుడు రామమూర్తి అసాధ్యుడు. ఎల్లాగైనా ఒప్పించి, నరసింహానికి ధైర్యం చెప్పి తప్పకుండా ఇంటికి తీసుకురాగలడు. ఒకవేళ తీసుకురాలేకపోతే!. అనుకుంటూ ఒక నిట్టూర్పు విడిచాడు.

బంట్రోతు టేబిలుమీద ఫైళ్లు చేరుస్తున్నాడు. అప్పుడే ఒకప్రక్క ఫైళ్లు కొండలా పెరిగిపోయాయి. అడపా తడపా చూడ్డానికి వచ్చిన వర్తకులతో మితంగా సంభాషించడం తప్ప, మరేపని చేయటం లేదు. ధ్యాస అంతా నరసింహంమీద ఉంది. తన చెల్లెలు కుటుంబం ముందుగతి ఏమౌతుందా అని పరిపరివిధాల మనోవ్యాకులతతో బాధపడసాగాడు అవధాని.

వీధిలో ఎండ మిటమిటలాడుతోంది. బాటసారులు ఎండవేడికి గుడ్డ నెత్తిన వేసుకొని పోతున్నారు. ఆఫీసు ప్రక్కనే వేళ్లు కుతుకుని విశాలంగా ఎదిగిన మఱ్ఱివృక్షం మీదుగా వచ్చే చల్లగాలివల్ల అవధానికి ఎండవేడి అంతగా తగలటం లేదు. బాటసారులు అవస్థలుపడి నడుస్తూ చెమటలు కక్కుతున్నారు. కాని అవధాని తలపైన పంఖా తిరుగుతోంది. కాయకష్టంతో జీవనం చేసే వాళ్ళకు, గదిలో కుర్చీమీద కాలేసుకుని కాగితాలు వ్రాసుకుంటూ సంపాదించేవారికి మధ్యగల వ్యత్యాసం గోచరించింది అవధానికి. అసలు ప్రపంచంలో ఏ జీవితపథంలో చూసినా ఏ కష్టాలూ లేవని ఎవరనగలరు? తను హాయిగా సంపాదిస్తున్నా క్లేశంతో హృదయం తరుక్కుపోతోంది. భార్య పోయాక, ఆమెమీద మమతలతో మళ్లీ పెండ్లిచేసుకో బుద్ధిపుట్టలేదు. పెండ్లి చేసుకోకపోతే ఆదరించి ఇంట్లో అన్నం పెట్టే దిక్కు కనిపించటం లేదు. బంట్రోతు ఉన్నారు కనుక వారి సహాయంతో ప్రతి రోజూ ఏదో కొంత ఉడకేసుకుని తింటున్నాడు. ప్రతీరోజూ వంటచేసుకోడం, అందులో ఉద్యోగం చేసుకునే తనవంటి మగవాడు వంటచేసుకోడం చాలా కష్టమైన పని అయినా తప్పటం లేదు. మమతలు నిండిన హృదయానికి, కష్టాలు నిండిన ఒంటరి జీవితానికి ఏ విధంగా సమన్వయం కుదరగలదు?

పెరిగిపోయిన ఫైళ్లు ఒక్కటొక్కటి తీశాడు. తోచినట్లు ఉత్తరువులు జారీ చేశాడు. రెండుగంటలు కాగానే ఇంక పనిచేసే బుద్ధి కలగలేదు. తలనొప్పి విజృంభించింది. కాగితాలు బల్లమీద వదిలేసి, ఆఫీసుకు ఆమడదూరంలో ఉన్న తన బంగళాకు వచ్చేశాడు.

చుట్టూ మఱ్ఱిచెట్ల నీడలమీదుగా వీసిరే గాలి అవధాని శరీరానికి చల్లగా [illegible]సులుతోంది. పక్కమీద పడుకున్నాడు. చికాకైన మనస్సుకు విశ్రాంతి యివ్వాలని పట్టుదలతో కళ్ళు మూశాడు. ఒక పదిహేను నిమిషాలలో గాఢంగా నిద్రపోయాడు.

సాయంత్రం అయిదుగంటలకు లేచాడు. సరిగ్గా రాయపూరునుంచి రైలు వచ్చే టైమయింది. వస్తే రామమూర్తి నరసింహాన్ని తీసుకొని యీ బండీలో రావచ్చును. గబగబ అవధాని ముఖం కడుక్కొని దుస్తులు వేసుకున్నాడు. జోళ్ళు తొడుక్కొని కంగారుగా గుమ్మం దిగబోతున్నాడు. దూరాన తన ఆఫీసు ప్రాంగణం నుంచి ఇద్దరు వ్యక్తులు నడిచి రావడం, వారిలో రామమూర్తి కూడా కనిపించడం, అవధానిని వారాత్తుగా ఆపేశాయి. ప్రక్కనే నరసింహం కూడా కనిపించాడు. అవధాని హృదయం ఆనందంతో పులకితమయింది. 'ఇంక ఫరవాలేదు' అనుకుంటూ దూరాన కనిపించే రామమూర్తి నరసింహంల వైపు తన జేబు రుమాలు ఆడిస్తూ స్వాగతమిస్తూ చిఱునవ్వు నవ్వాడు.

నరసింహం తల వంచుకుని గుమ్మంలో అడుగుపెట్టాడు. గంభీరమైన అతని వదనంలో మిలమిల మెరిసే అతని కనుపాపలు కన్నీటితో తడిశాయి. ఒంటిమీద కప్పుకున్న ఖద్దరు కండువాతో కళ్లు తుడుచుకున్నాడు.

అవధాని ఏమీ మాట్లాడలేక మౌనం వహించాడు. రామమూర్తి జాలిగా ప్రక్కనే ఉన్న ఒక కుర్చీలో కూర్చున్నాడు. ముగ్గురిలో రెండు క్షణాలు నిశ్శబ్దం మహా [illegible]ంచింది.

అంత గంభీరంగా మౌనంగా కూర్చున్న నరసింహం ఒక్కసారి చంటపిల్లవాడిలా వెక్కి వెక్కి ఏడ్చాడు. వచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక, చేసిన పనికి కించపడి, అవధానికి ముఖం చూపించలేక కండువా అడ్డు పెట్టుకుంటున్నాడు.

“నరసింహం! సంగతులన్నీ నాతో విపులంగా చెబితే నేను నీకు సహాయం చెయ్యకపోదునా? ఈమాత్రందానికి బెంబేలుపడి, కుటుంబాన్ని విడిచి లేచిపోవాలా?”

నరసింహం సమాధానం చెప్పలేకపోయాడు. తల వంచుకుని, దుఃఖం ఆపుకుని, మౌనంగా కూర్చున్నాడు.

'ముందు లేచి, నీళ్లు పోసుకుని బట్టలు మార్చుకో!' అన్నాడు అవధాని.

రామమూర్తి నరసింహాన్ని లేవదీసి, బాత్‌రూమ్‌దగ్గరకు తీసుకువెళ్ళాడు. అవధాని తన పెట్టెలోని ఇస్త్రీ మడతల పంచె, చొక్కా, తువ్వాలు నరసింహం ఉపయోగానికి బైటకు తీశాడు.

నరసింహం స్నానం చేస్తున్నాడు.

'గొడవ పెట్టకుండా తిన్నగా ఇంటికి వచ్చాడా' అన్నాడు అవధాని రామమూర్తివైపు చూస్తూ.

'లేచిపోయినవాడు ఒక పట్టాన ఇంటి ముఖం పడతాడూ, చెప్పవలసినవన్నీ చెప్పి ఒప్పించడానికి బ్రహ్మ దిగివచ్చినంత పనయింది' అన్నాడు రామమూర్తి.

'బాగుంది' అనుకుంటూ అవధాని వెళ్ళి వాలుకుర్చీలో మేను వాల్చాడు.

రామమూర్తి కూడా ప్రయాణ బడలిక తీర్చుకోడానికి స్నానాదికృత్యాలు చేయాలని సిద్ధమయ్యాడు.

నరసింహాన్ని మొట్టమొదట తన మరదలు పెళ్ళికి పెద్దాపురం వెళ్ళినప్పుడు చూశాడు. నరసింహం తల్లికి, తన అత్తగారికి ఏదో దూరపు బంధుత్వం, స్నేహం కూడా ఉన్నాయి. తన పెళ్ళికి నరసింహం రాలేదు. కాని తన మరదలు పెళ్ళికి తప్పక రావలసిందని బలవంత పెడుతూ ఒక ప్రత్యేక ఉత్తరం వ్రాసింది తన అత్తగారు

---

కున్నట్టుంది. అతని రక్తం వేడెక్కిపోగా “ఛీ-నీ మొహం” అంటూ ముందుకు దూకాడు. అతని మాటల్ని అణిచివేస్తూ ఎక్స్‌ప్రెస్ బ్రహ్మాండమైన రొదతో ముందుకు సాగిపోయింది అప్పుడే ★

★ ఉదయకిరణాలు ★

నరసింహం తల్లికి అందువల్ల నరసింహం కూడా తన తల్లితో పెళ్ళికి వచ్చేడు

అప్పటికి నరసింహం అయిదవ ఫారం చదువుతున్నాడు పది హేనేండ్లు ఉంటాయి మంచి చలాకీగా, అల్లరి చెయ్యడంలోనూ నవ్వించడంలో బాగా ఆరితేరినవాడు పెండ్లికి రావడంతడవుగా ఆడ పెళ్ళివారి పనులన్నీ తన నెత్తిన వేసుకున్నాడు పల్లకీని పిలిపించడం, బాజా భజంత్రీలను వాయించమనడం, మొంగ పెళ్ళివారిని ఫలహారాలతో ఆదరించడం, అందరికీ భోజన సదుపాయాలు అమరుస్తూ వంటింట్లో ఖుంజాయింపు చెయ్యడం, భోజన సమయాలలో చమత్కార సంభాషణలతో అందరినీ నవ్విస్తూ వడ్డన చెయ్యడం ఇవన్నీ అవధాని తలలో తిరిగాయి అతని చలాకీ, తెలివిచూసి అవధాని యిట్టే స్నేహం కలిపాడు. తర్వాత ఏదో దూరపు బంధుత్వం కూడా కలుపుకున్నారు ఆతర్వాత కాలం కూడివచ్చి నరసింహం తన చెల్లెలును పెండ్లి చేసుకున్నాడు

పది హేనురోజుల క్రితం ఆఫీసులో తను కాగితాలు వ్రాసుకుంటూ అర్జంటు పనితో హడావిడిగా ఉంటే, హఠాత్తుగా దిగాడు నరసింహం

'ఏరోయి బావా! మహా బలే జోరుగా పనిచేస్తున్నావే' అంటూ గుమ్మంలోనే అరిచాడు

అవధాని తల ఎత్తి చూశాడు ఎదురుగా నరసింహాన్ని చూడగానే ఆఫీసు చికాకు, ఒక్కసారిగా మాయమయి, ముఖంలో ఆనందరేఖలు వెల్లి విరిశాయి

'మహానుభావా! ఇదిఆఫీసు, ఇల్లుకాదు మెల్లిగా మాట్లాడు కాలంలో రైతులా కేకవేస్తావేమిటి?' అవధాని హాస్యం చేశాడు కావని

"ఈ ఆఫీసుకు అధికారివి అసలు ఇల్లుకు మించిన సుఖాలుంటే యిల్లు లేదా ఆఫీసు నీలాంటివాడికి" చమత్కరించాడు నరసింహం

'పెట్టె బెడ్డింగు ఏవీ లేకేడా? సికారుకు బయలుదేరినట్లు ఇలా వచ్చేవేమిటి?' అవధాని నరసింహాన్ని కింద పైన పరీక్షించాడు

'విశాఖపట్నం పనిమీదవచ్చి నిన్ను ఒకసారి చూసిపోదామని ఇలా వచ్చాను 'నువ్వుండగా పెట్టె బెడ్డింగు నా కెందుకురా?' నరసింహం నవ్వాడు.

'బలే బాగుంది. నన్ను దోచుకోవల్సివా ఏమిటి' మందహాసమైన కోపం చూపించాడు అవధాని

'బావమఱదులు ఒకళ్ళ నొకళ్లు దోచుకోడం ధర్మయుక్తమైన కార్యం' అంటూ సిద్ధాంతీకరించాడు నరసింహం

కుర్చీమీద వేలాడుతున్న కోటు తొడుక్కుని పైపై సర్దుకుని, ఈలవేసుకుంటూ 'పదరా' అంటూ నరసింహాన్ని నడిపించాడు అవధాని, బంట్రోతును పిలిచి తన ఆఫీసుగది బంద్ చెయ్యమని ఆర్డరు జారీ చేసేడు కులాసాగాపోయే అధికారివైపు సరదాగా చూశారు గుమాస్తాలు తాము కూడా మెల్లిగా ఆఫీసులోంచి జారుకోడానికి అవకాశం దొరికిందని కులుకుతూ!

'ఒరే సినీమాలు ఏమున్నాయిరా?' నరసింహం అడిగాడు

'గొల్లభామ ఆడుతోంది'

'వదవ తెలుగు సినిమాలు లెఖ్ఖ హిందీవి ఏమున్నాయి'

'కిస్మత్ బాగుందంటున్నారు'

'ఎవరు ఏక్టర్లు'

'అశోక్ కుమార్, ముంతాజ్ శాంతి వగైరాలు'

'పదరా పోదాం'

'పైసలు?'

'బావమఱదులు ఒకళ్ళ నొకళ్లు దోచుకోడం ధర్మయుక్తమైన కార్యం'

సిద్ధాంతాన్ని పునరుద్ఘాటించాడు నరసింహం అవధాని ఫక్కున నవ్వుకున్నాడు

'ఇంటివద్దర అంతా కులాసా?' మామూలుగా కుశలప్రశ్న వేశాడు అవధాని

'ఆఁ చచ్చేటంత కులాసాగా ఉన్నారు!' అంటూ ఫక ఫకా నవ్వాడు నరసింహం

అసలు నరసింహం, అవధాని ఒక్క క్షణం హాస్యంగా మాట్లాడుకోకుండా ఉండలేరు వారిద్దరూ స్నేహితులు అవడానికి కారణం ముఖ్యంగా హాస్య సంభాషణే

ఛలోక్తులతో, హాస్యంతో, సినీమాలతో కుటుంబంలోని బంధువుల గురించి కబుర్లతో పురాతనకాలపు అనుభవాల జ్ఞాపకాలతో రెండు రోజులు ఆనందంగా దొర్లిపోయాయి నరసింహం ఒకరోజుప్రొద్దున్నే లేచి 'అబ్బాయి సెలవయిపోయింది వెళ్ళిపోవాలిరా' అన్నాడు

'ఇంకోరోజు ఉండరా' అన్నాడు అవధాని

'కుదరదోయి! నీలా ఆఫీసర్నయితే ఎన్ని రోజులైనా యిక్కడే ఉండేవాణ్ణి! కాని కాదుగామరి!!' అంటూ నవ్వాడు నరసింహం అవధానికూడా నవ్వుతూ 'సరే నీ యిష్టం!' అన్నాడు

'రైలుకు టైమయింది' అంటూ కూడా వడిగా పరుగెత్తాడు నరసింహం 'ఉండరా నేనూ వస్తా రైలుస్టేషనుకు' అంటూ అవధాని సిద్ధం కాబోయేలోగు 'నీకోసం ఆగుతే రైలు దాటిపోతుంది' అంటూ అవధాని మాటలు వినిపించుకోకుండా రైలుస్టేషనుకు గబగబ నడిచిపోయాడు నరసింహం తనకి కూడా ఆఫీసుకు వెళ్ళే టైమయిందని, నరసింహం సంగతి వదిలేసి, ఆఫీసు దుస్తులు వేసుకున్నాడు అవధాని దూరాన రైలు కూత వినిపించింది నరసింహం రైలు ఎక్కి ఉంటాడు అనుకున్నాడు అవధాని తిరిగి ఒంటరి జీవితంతో, నిరాశాపూరితమైన సంతృప్తితో, గడపవలసిన జీవితం తల్చుకుంటూ ఆఫీసు వైపు నడిచాడు అవధాని

కుర్చీలో కూర్చున్న అవధానికి పది హేను రోజుల క్రితం జరిగిన దృశ్యం స్మృతి దర్పణంలో ప్రతిబింబించింది కుటుంబాన్ని వదిలేసి, ఎంతో దుఃఖంతో కుములుతూన్న నరసింహం, అంత గంభీరంగా దుఃఖం దాచుకుని, పైకి హాస్యంగా ఖులాసాగా ఎలా తనతో గడపగల్గేడా అని ఒక్కసారి ఆశ్చర్యపోయాడు అతను నరసింహంలోని ఆవేదన పిసరంతైనా పసిగట్టలేకపోయాడు అవధాని తర్వాత సోమయాజులు దగ్గర నుంచి ఉత్తరం వచ్చాక, చేతికో అంకవలసిన పిట్ట జారిపోయిందని, ఎంతో బాధపడ్డాడు అవధాని

నరసింహం స్నానంచేసి, ఇస్త్రీబట్టలు వేసుకుని నవ్వుతూ అవధాని ప్రక్క కుర్చీలో కూర్చున్నాడు అప్పటిదాకా ఏడుస్తూ ముఖం దాచుకున్న నరసింహం ఇంతలో నవ్వుతూ ఎదురుగా రావడం అవధానికి విచిత్ర మనిపించింది

'ఏం భాయి! ఖులాసాగా ఉన్నావా?' అన్నాడు నరసింహం

ఈ చమత్కార సంభాషణ అవధానికి తమాషాలా కనిపించింది అసలు ఆ ప్రశ్న తను వెయ్యవలసినది

'నే నీమున్న కులాసాగా లేనోయి! నా పెళ్ళాం బిడ్డలని వదిలేసి లేచిపోయాను' అన్నాడు అవధాని చమత్కారంగా

'అరెరె! సంగతులన్నీ నాతో విపులంగా చెబితే నేను నీకు సహాయం చెయ్యకపోదునా? ఈమాత్రం దానికి బెంబేలుపడి కుటుంబాన్ని విడిచి లేచిపోవాలా?' అని మునుపటి అవధాని మాటలు జ్ఞప్తికి తెచ్చాడు నరసింహం, నవ్వుతూ అవధానికి పొట్ట చెక్కలయ్యేటంత నవ్వు వచ్చింది ఆ నవ్వులో ప్రతి కల్పాడు నరసింహం ఈ నవ్వులు విని, స్నానం చేసి తువ్వాలు కట్టుకుని తిన్నగా అక్కడకు వచ్చిన రామమూర్తి, తనుకూడా సంగతి ఊహించుకుని నవ్వసాగాడు

కాస్సేపు నవ్వులు పువ్వుల్లా రాలాయి ఆ వరండాలో

'బలే తమాషా మనిషివిలే' అన్నాడు అవధాని

'నేనా? నువ్వా?' ఎదురుప్రశ్నించాడు నరసింహం 'సరేలేకాని, సినీమాకి పోదాం లే' అని ప్రతిపాదించాడు రామమూర్తి కూడా సినీమాకి వెడదామన్నాడు అగ్నిలా ఆవేదన లోలోపల భుగభుగమంటున్నా, ప్రశాంతంగా పైకి నవ్వుతూన్న నరసింహం మనస్సుకు ఏదో ఆనందకరమైన విషయాలు చూపి, శాంతి కలిగించాలని నిశ్చయించాడు అవధాని సరే అని ముగ్గురూ సినీమాకి వెళ్ళారు. అవధాని ఆ సాయంత్రం నరసింహం ఇంట సంగతులు ఏమీ మాట్లాడలేదు

ఖర్గపురం బ్యాంకిలో పనిచేస్తున్నాడు రామమూర్తి ఏదో పనిమీద విజయనగరం వస్తే తనకు సెలవు దొరకకపోవడంవల్ల అతన్ని బ్రతిమాలేడు, నరసింహాన్ని తన యింటికి తీసుకురావలసిందని చిన్నప్పటి స్నేహితుడైన రామమూర్తి అవధాని కోరిక కాదనలేకపోయాడు

'నే వెళ్ళిపోవాలిరా!' రామమూర్తి అన్నాడు మర్నాడు సాయంత్రం అవధానితో ముగ్గురు రైలుస్టేషనుకు వచ్చారు

'నీ మేలు మరిచిపోలేనురా రామమూర్తీ! జన్మజన్మాలా నీకు కృతజ్ఞుణ్ణి!' అన్నాడు అవధాని రామమూర్తితో షేక్ హాండు చేస్తూ, రైలు స్టేషనులో

'నే చేసింది ఏమీ లేదు పరిస్థితులు ఆనందకరంగా పరిణమించాయి అంతే చాలు' అన్నాడు రామమూర్తి తన కర్తవ్యం నెరవేరిందన్న సంతృప్తితో

మౌనంగా ప్రక్కనే అప్పటివరకు తల వొంచుకుని నుంచున్న నరసింహం ఒకసారి ఆకాశంవైపు చూశాడు వాళ్లిద్దరి సంభాషణ విని

గబగబ రామమూర్తికి షేక్ హాండు యిస్తూ "చాలా కృతజ్ఞుణ్ణి! జాగ్రత్తగా నన్ను ఇంట చేర్చినందుకు!" అంటూ చిరునవ్వు నవ్వాడు నరసింహం

ముగ్గురూ ముసిముసి నవ్వులు నవ్వుతున్నారు రైలు కూతకూసింది బయలుదేరుతున్నానంటూ రామమూర్తి రైలుఎక్కి తన సీటులో కూర్చున్నాడు రైలు చకచకా నడిచి పరుగెత్తింది

మౌనంగా తలలు వంచుకుని ఏదో ఆలోచిస్తూ నరసింహం, అవధాని, ఇంటికి చేరుకున్నారు

'నేను కూడా రేపు కోటిపల్లికి ప్రయాణమౌతానోయి బావా!' అన్నాడు నరసింహం నాటకంలో నటుడిలా, కుర్చీలో కూర్చుని కాళ్లు సాచుకుంటూ

'వెడుదువుగానిలే - తొందరేమొచ్చింది' అవధాని తీవ్రంగా ఏదో ఆలోచిస్తూ కోటు విప్పుకున్నాడు

"ఆఁ తొందర ఏమీలేదు కాని పెళ్లాం బిడ్డలమీద బెంగపెట్టుకున్నాను" హాస్యధోరణి నడిపించాడు నరసింహం.

'అంత బెంగ ఉన్నవాడు, వివేకం, జ్ఞానం లేకుండా పెళ్లాం బిడ్డల్ని వదిలేసిపోడు!' అన్నాడు అవధాని కటువుగా.

అవధాని హాస్యం ఆనందించే కాలం దాటిపోయిందని గ్రహించాడు నరసింహం పైగా అవధాని అన్నమాటలు వెటకారంగా తన్ను వెక్కిరించాయి

ఇద్దరి మధ్యా మళ్లీ ఒక క్షణం నిశ్శబ్దం

'ఇంటిదగ్గిర జరిగిన అసలు విషయాలు చెప్పావు కాదు' నరసింహం లేచిపోయిన కారణం పరిశోధించడం మొదలు పెట్టాడు అవధాని

'ఏముంది! మామూలుగాఉన్న పరిస్థితులే మరింత ప్రమాదించాయి'

'కొంచెం విపులంగా చెబితే తెలుస్తుందిగా'

'కోటిపల్లివచ్చాక కొంతమంది స్నేహితులు పెరిగారు వాళ్లకి నాలాగే పేకాటలంటే యిష్టం పేకాటమీదఉన్న మోజుకొద్ది రోజూ ఆడేవాళ్లం. తెలుసుగా! నాకెప్పుడూ నష్టమే వచ్చేది! పోయినసొమ్ము గడించుకోవాలని మరీ ఆడేవాణ్ణి! ఒక్కొక్కసారి విసుగెత్తి మానేస్తే, గౌరవహీనంగా స్నేహితులాడే దెప్పుళ్ళు నా ఆత్మాభిమానాన్ని రెచ్చగొట్టి తిరిగి పేకాటఆడేవాణ్ణి చాలా వేలు నష్టపోయాను అందుకు బ్యాంకిలో అప్పులు చేశాను

మునుపు పెద్దమ్మాయి పెళ్ళికి చేసిన అప్పు యింకా తీర్చలేక పోయాను తీరు

ద్దామనుకుంటూనే అశ్రద్ధ చేశాను ఇంట్లో రోజూ మాణిక్యం పోరు పెట్టేది అప్పులు తీర్చమని చిరాకుతో దాన్ని కసిరేవాణ్ణి పైగా స్నేహితులంతా బ్రాందీ, విస్కీ త్రాగేవారు వారితోపాటు నాకూ అలవాటయింది ఆ మైకంలో లెక్క చెయ్యకుండా పేకాటకు, మద్యానికి యిష్టంవచ్చినట్లు ఖర్చుపెట్టేశాను ఇంటికివచ్చి ఒక్కొక్క రోజు చేసిన ఖర్చుకు పశ్చాత్తాపపడేవాడిని కాని మళ్ళీ స్నేహితులను చూసేసరికి మామూలుగా మందు పెట్టిన మనిషిలా మారిపోయేవాడిని

ఒకరోజు తెగించి భూములు అమ్మి, బ్యాంకి అప్పుతీరుద్దామనుకున్నాను నువ్వు ఏడాదినుంచి పంపే పదిహేను రూపాయిలు మాణిక్యం తీసుకుని కుటుంబ ఖర్చుకు వినియోగించేది నా జీతంలో చాలాభాగం దానికి యివ్వలేకపోయేవాణ్ణి అప్పుడే బ్యాంకినుంచి నోటీసు వచ్చింది చేసిన అప్పు తణఖా పెట్టిన భూముల విలువ మించిపోతూందని, తక్షణం అప్పుతీర్చకపోతే, భూములు వేలంవేసి స్వాధీనం చేసుకోగలమని వ్రాశారు అది చూసి కంగారుపడి రామచంద్రపురం పరుగెత్తాను

బ్యాంకి ప్రెసిడెంటు చౌదరికి నేనంటే కోపం కిందటి ఎన్నికలలో తనకి ప్రచారం చెయ్యమన్నాడు అతని ప్రత్యర్థి నారాయణరావు నాకు చిన్నతనంలో క్లాసు మేటు అతనికి ఎన్నికలలో సహాయం చేశాను చివరికి చౌదరి గెలిచాడు ఆకక్ష ఇప్పటికీ మనస్సులో పెట్టుకున్నాడు నా భూములు వేలంపాట పెట్టించాడు, తన ప్రభావం పలుకుబడివల్ల చుట్టుప్రక్కల యీనాందారు లెవ్వరూ వేలంకు ఎక్కకుండా చేశాడు నాకు తెలియకుండా తనవాణ్ణి ఒకణ్ణి పెట్టి వేలం పాడించాడు భూముల విలువకు అయిదు వేలు తక్కువ పాట వేయించాడు ఎవ్వరూ ముందుకు రాకుండా, పాట హెచ్చించకుండా, మొద్దుముఖాలతో వేలంపాటలో నుంచున్న ఈనాందారులను చూసి ఒళ్లు మండింది నాకు చౌదరి చేసిన మోసం, దగా, నా ఆత్మగౌరవాన్ని హతమార్చినట్లయింది కోపంతో భూములన్నీ తెగనమ్మి అప్పులు తీర్చేసి, కానీ మిగలక, విచారంతో ఇంటికి వచ్చేశాను

నా రోజులు బాగులేవనుకుంటూ పేకాటల్లో మునిగి ఆఫీసు పనులు సరిగా చెయ్యలేకపోయాను చౌదరి తన పలుకుబడితో నా ఉద్యోగానికి ఎసరు పెట్టాలని ప్రయత్నించాడు మా పంచాయితీబోర్డు అధ్యక్షుడు చౌదరి స్నేహితుడు. గ్రామాలు సరిగా తనిఖీ చెయ్యటం లేదని, రిపోర్టు పంపించటం లేదని, ఆఫీసు పనిలో అన్నీ తప్పులే అని, శిక్షగా ఆరు నెలలు ఉద్యోగం నుంచి నన్ను తీసేశారు ఆస్తి పోయింది ఉద్యోగం ఊడింది చేసిన తెలివి తక్కువ పనులకు చాలా విచారించాను రెండు రోజులు ఏకధారగా ఏడ్చాను కడుపు తరుక్కుపోయే బాధతో కుమిలిపోయాను నేను కుటుంబానికి ఏమీ యింక చెయ్యలేనేమో అని భయం వేసింది ఊళ్లో అయిదు వందల చిల్లర అప్పులు పెరిగిపోయాయి రోజూ అప్పుల వాళ్ళు వచ్చి పీక్కుతింటున్నారు ఇవన్నీ ఎవరితో చెప్పుకోను!!

చేతకాని తనంలో కుటుంబాన్ని ఆర్థికంగా బాధపెట్టేకంటే కుటుంబాన్ని వదిలిపోతే, ఎవరైనా ధర్మాత్ములు ఆదుకోగలరని ఆశించి, లేచిపోయాను!!

తన కథ చెప్పి ఒక్క నిట్టూర్పు విడిచాడు నరసింహం!

'నీ కుటుంబం రక్షించడానికి ధర్మాత్ములు కొల్లలుగా పుడతారనుకున్నావా?' అన్నాడు కోపంగా అవధాని

నరసింహం మళ్ళీ హాస్యం మొదలు పెట్టాడు

'అప్పుడే ఒక ధర్మాత్ముడు పుట్టాడులే! వాడి పేరే అవధాని' అన్నాడు నరసింహం

అవధాని కోపం పటాపంచలయి ఫక్కున నవ్వాడు ఇద్దరూ భోజనాలకి లేచారు

భోజనాలు పూర్తయ్యాక "మరి! నేను రేపు పొద్దున్న బండిలో వెడతా!" నరసింహం అవధానివైపు చూశాడు అవధాని ఒక్క క్షణం ఆలోచించాడు

'అనవసరంగా ఏమీ ఆలోచించకు నేను యింటికి రేపు వెళ్ళితీరాలి' అన్నాడు నరసింహం నిశ్చితమైన వదనంతో

'మరి పెళ్లాం బిడ్డల్ని పోషించేమార్గం?'

'నాకు లోటేమిటి? నువ్వున్నావుగా!'

ఇద్దరూ నవ్వుకున్నారు

'సరే! అప్పులు ముందు తీర్చేశెయ్యి నా ప్రావిడెంటు ఫండునుంచి అప్పుతీసుకుని త్వరలో అయిదువందలు పంపిస్తాను ఈ ఆరునెలలు, నీ ఉద్యోగం తిరిగివచ్చేదాకా, నెలకు ఏభయిరూపాయిలు పంపుతా జాగ్రత్తగా కాలక్షేపం చేసుకోవాలి" అందనాలు వేసి తాను చెయ్యబోయే సహాయం వివరించాడు అవధాని

'ఓ! మహారాజులా బ్రతకగలను' అంటూ మీసాలు దువ్వుకున్నాడు నరసింహం

'సరే పడుకో ఈ రాత్రికి, ఇంక గొడవ పెట్టక' అవధాని దుప్పటి ముసుగు బిగించాడు

నరసింహం తన ప్రక్క సర్దుకున్నాడు

గబుక్కున దుప్పటి తొలగించి లేచి కూర్చున్నాడు అవధాని

'నువ్వు తిన్నగా యింటికి వెడతావా?'

అవధాని వేసిన ఈ ప్రశ్న విని, అతని ముఖంలోకి సూటిగా చూశాడు నరసింహం

"నా మాట నమ్మవా! ప్రయాణం చేస్తాను!" అంటూ ముఖం ప్రక్కకు త్రిప్పేసుకున్నాడు అవధాని సంతృప్తితో ఒరిగాడు ప్రక్కమీద

నరసింహం ప్రక్కమీద కళ్లుమూశాడు మరో నిమిషంలో గబుక్కున లేచి కూర్చున్నాడు

'సోమయాజులుకు ఒక టెలిగ్రాం యిియ్య ప్రకాశాన్ని స్టేషనుకు తీసుకు రమ్మని' అన్నాడు నరసింహం

'కాకినాడలో దిగి సోమయాజులు బావ యింట్లో ఒకరోజు ఉండు' సూచించాడు అవధాని

'కాకినాడలో వాళ్ళింటికి ఇప్పుడు వెళ్లను' అని ముఖం చిట్లించాడు

అవధాని నరసింహం మనస్సు అర్థంచేసుకున్నాడు

ఇద్దరూ కలిసి ఊళ్లోకి వెళ్ళి ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం ఒకటి సోమయాజులుకు పంపి, మామూలుగా ఇంటికి వచ్చి పడుకున్నారు

తెల్లవారగానే నరసింహం గబగబలేచి స్నానాదులు పూర్తిచేసుకుని అవధానిని లేపాడు ఇద్దరూ రైలుస్టేషనుకు హడావడిగా ఒగర్చుకుంటూ వచ్చేశారు టైమయిందని. అవధాని టిక్కెట్టుకొని నరసింహానికి యిస్తూ ఒక కవరుకూడా చేతిలో పెట్టాడు అందులో ఏభయి రూపాయలు కనిపించాయి నరసింహానికి 'ఇది మొదటి నెల జీవిత భత్యమన్నమాట' అంటూ నరసింహం నవ్వుకున్నాడు.

'అనవసరంగా బెంగపెట్టుకోకు దేనికీ ఉద్యోగంలో త్వరలో చేరి జాగ్రత్తగా మసులుకో!' వెళ్లాక ఒక ఉత్తరం వ్రాయి!

మౌనంగా నుంచున్నాడు నరసింహం

'కష్టాలు ప్రతీవాడికి వస్తాయి ధైర్యంగా ముందుకు పురోగమిస్తేనే జీవితం సఫలవంత మౌతుంది' అవధాని చెప్పవలసిన తుది వాక్యం చెప్పాడు

రైలు కదిలింది నరసింహం రైలు ఎక్కాడు రైలు చూపులోంచి దాటిపోయేదాకా అవధాని, అవధాని చూపులోంచి దాటిపోయేదాకా రైలు పెట్టె తలుపువద్ద నరసింహం, ఒకరివైపు ఒకరు హత్తుకుపోయిన హృదయాల అభిమానంతో, చూస్తూ నిలుచుండిపోయారు

(ఇంకా ఉంది)




# 49

ఆ మర్నాడు మధ్యాహ్నం వరదరాజు ఏడుకొండల్ని తీసుకొని పచ్చ మేడకి వెళ్ళాడు చలికాలపుఎండ మార్దవంగా సుఖంగా వుంది వరదరాజు జనసందోహాన్ని పట్టించుకోకుండా మౌనంగా నడుస్తున్నాడు ఒకవంక విజయవాడంతా ఎలక్షన్ హడావుడిలో హోరెత్తిపోతోంది ఏ గుర్రబ్బండిమీద చూసినా "మీవోటు వారికే" అని పోస్టర్లు ప్రతిగోడమీదా పెద్దపెద్ద బోర్డులు అవి లేనిచోట కనీసం బొగ్గుమసితో అయినాసరే ఇదే నినాదాలు గీశారు సిమెంటురోడ్డుమీదకూడా ప్రతిగజానికో పోస్టరు అంటించబడి వున్నాయి ప్రచారపు బండ్లు మైకులు అమర్చుకుని అరిచినవి అరిచినట్టే తిరుగుతున్నాయి పెట్రోలు మంచినీళ్ళలా ఖర్చయిపోతోంది కార్ల తిరుగుడికి అంతులేదు

శాస్త్రిగారు కరుణమూర్తివార్డులో తిరుగుతూండడంవల్ల వరదరాజువేపు రావటంలేదు వరదరాజుకి ఎలక్షన్ పని ఎంత వున్నప్పటికీ, అడితీలో పనివున్నప్పటికీ, రాత్రి 'చిన్నా'కి సుస్తీ బాగా ఎక్కువైంది అని విన్నాడు అందువల్ల మధ్యాహ్నానికి అన్నిపన్లూ వొదిలించుకుని ఇక్కడికి బయల్దేరాడు అతని మనస్సెందుకో చాలా చికాకుగా వుంది అతనికి ఠక్కునే జ్ఞాపకం వొచ్చింది కుర్రాడు పెద్దాస్పత్రిలో వున్నాడుగదా అని అతను ఆస్పత్రికి వచ్చాడు

విశాలమైన ఆస్పత్రిభవనాలు నల్లరాతి గోడలతో కట్టబడి, పెద్దపెద్ద కిటికీలతో, వాకిళ్ళతో నిలబడి వున్నాయి లోపలికొక కంకరమన్నురోడ్డున్నది వరదరాజు మొదటివార్డుబైట మెట్లెక్కి పై అరుగుమీద అడుగు పెట్టాడు అతని కెదురుగా ఆస్పత్రి వార్డుకి బైట వాకిలికి పక్కగా, ఎవరో ముసుగు కప్పుకుని పడుకుని వున్నారు ఆ వ్యక్తికి కొంచెందూరంలో నేలమీద రత్తమ్మ కూచునివుంది బాగా ఏడవటంవల్లకాబోలు ఆమెకళ్ళు ఎర్రబారి వున్నాయి

వరదరాజు ఏడుకొండలువైపుతిరిగి, "ఒరే ఆకుర్రాణ్ణి ఎరుగుదువుగా? ఏవార్డులో వున్నాడో చూసిరారా నేను ఇక్కడ రెండునిమిషాలు మాట్లాడి వస్తాను!" అన్నాడు ఏడుకొండలు లోపలికి వెళ్ళాడు వరదరాజు మనస్సులో భయంకరమైన ఒక సందేహం పొడచూపింది.. రత్తమ్మ మొగుడు కాదుకదా! ఆ పడుకున్నదీ! అని.

అతను ఒకసారి అంతటా కలియజూశాడు ఆస్పత్రి నిశ్శబ్దంగా వుంది మధ్యాహ్నంపూటగావటంతో నర్సులూ డాక్టర్లూ సగంమంది లేరు రోగులమూలుగులూ, నర్సుల డాక్టర్ల బూట్ల చప్పుళ్లూ, విచిత్రమైన ఆస్పత్రివాసన, నర్సుల గొంతుకలూ మాత్రం అప్పుడప్పుడు వినిపిస్తున్నాయి

వరదరాజు తలవొంచుకుని కూర్చున్న రత్తమ్మదగ్గిరకి వెళ్ళాడు "ఏం రత్తమ్మా!" అని పలకరించాడు అతని కేదో తెలియరాని ఆందోళన బయలుదేరింది

రత్తమ్మ తలెత్తి వరదరాజుముఖంలోకి చూసింది ఆమె వెంటనే గుర్తు పట్టలేకపోయింది. రెండునిమిషాలకి "మామా" అన్నది మూలుగుతూ ఆ వుత్తరక్షణమే గొల్లుమంది.

వరదరాజు వొంగి ఆమె తల నిమురుతూ, "ఎందుకట్లా ఏడుస్తావు? ఎవరది?" అని ప్రశ్నించాడు. అవతల నిండు ముసుగులో ఏచలనమూ లేకండా పడివున్న వ్యక్తివైపు చూస్తూ

"మామా!" అన్నది మళ్లీ రత్తమ్మ కొంచెం తమాయించుకున్నాక "వసంతం అక్కయ్య మామా! ఎట్లా ఐపోయిందో చూసినా?" అంది

వరదరాజుకి గుండెల్లో జలదరింపు ఆరంభమైంది "వసంతమా? ఏంజబ్బు?" అని అడిగా డతను అటు రెండడుగులు వేస్తూ.

రత్తమ్మ "వెళ్లకుమామా!. డాక్టర్ వెళ్ళొద్దన్నాడు .. ఆర్నెల్లనించీ ఈడనే పడివుండది " అన్నది.

వరదరాజు ఇంకో అడుగు వేశాడు; ఇంతలో ఒక డాక్టర్ బయటికి వొచ్చాడు; ఎర్రగా సన్నగా పొడుగ్గా వున్నాడు. అతను వరదరాజుదగ్గిరకొచ్చి "అటు వెళ్ళకయ్యా! " అన్నాడు.

కాని వరదరాజు ఆగకుండా పరాపరి వసంతందగ్గిర కెళ్ళి పై దుప్పటి లాగాడు సగంవరకు అతని గుండెలు ఝల్లుమన్నాయి "ఆ వసంతమేనా!" అనుకుంటూ అతను కళ్ళు మూసుకున్నాడు. వసంతం వొళ్లంతా కుష్ఠు వ్యాపించింది

వరదరాజు గబుక్కున ముసుగు తిరిగి కప్పేసి, డాక్టరువేపు తిరిగాడు "ఇదేం జబ్బు?" అని ప్రశ్నించాడు, దడదడలాడే గుండెతో.

"ఇదా! ఇది కుష్ఠు!" అన్నాడు డాక్టర్ శాంతంగా.

"ఏమిటి! కుష్ఠా!" అని అరిచాడు వరదరాజు అతనికి నుంచో బుద్ధికావటం లేదు ఏమిటో తత్తరగా వుంది. అతని మనస్సులో ఏదో మెదిలింది. "డాక్టర్! మీకేనా ఈవిడకి మందిచ్చేది?" అని ప్రశ్నించాడు వూపిరి బిగబట్టుకుని.

"మేమే!. " అంటూ డాక్టర్ లోపలికెళ్లాడు వరదరాజు అతని వెంబడే వెళ్లాడు గబగబ రెండు వార్డులలోగుండా మంచాలు దాటి ఓ గదిలోకి పోయినారిద్దరూ గదిలోకి వెళ్ళాక డాక్టర్ వెనక్కి చూసి, "ఏం వొచ్చారు?" అంటూ తన టేబిలుముందు కూర్చుని ప్రశ్నించాడు నిర్లక్ష్యంగా.



# అపస్వరాలు



డాక్టర్ గది శుభ్రంగా వుంది పెద్ద అద్దాల కిటికీలోనుంచి లోపలికి ఎండ పడుతోంది పచ్చగా వరదరాజు టేబిలు ఇవతల డాకర్కి ఎదురుగా నిలబడి, "ఎంత డబ్బైనా ఇస్తాను, ఆమె కిరోగం నయం చెయ్యండి!" అన్నాడు హుందాగా, జేబులోనించి వంద రూపాయల కాయితాలు తీసి బల్లమీద పడేసి.

డాక్టర్ చెయ్యి అడ్డంపెట్టి, "తీసుకోవయ్యా నీ డబ్బు తియ్యి ముందు! ఈపాటి సాయం, ఆర్నెల్లముందు చేసివుంటే బతికేది! చాలా ఆలస్యంగా వొచ్చావు! సరేగాని మీకే మవుతుం దామె!" అన్నాడు వరదరాజు ముఖంలోకి చూస్తూ

వరదరాజుకి ఇది సమ్మెటపోటులాంటి ప్రశ్న వసంతం తన కేమవుతుంది? తను వసంతాని కేమవుతాడు? ఆరోజుల్లో తను రోడ్లవెంబడి బలాదూర్ తిరిగే బికారి. ఆమె వొళ్లమ్ముకుని బతికే మనిషి తనను ఒకనాడు వానరోజున ఇంట్లోకి పిలిచి ఆద రించి కూడుపెట్టింది. అదే స్నేహం తను ఆమెను వొదిలే దాకా. .దానికి బంధుత్వపు రూపమేమీ లేదు . అతను తికమక పడ్డాడు పైకిమాత్రం గంభీరంగా, "డాక్టర్ గారూ, ఇంకా ఇంత డబ్బైనా సరే ..ఆమెకి నయం చెయ్యండి ఇస్తాను . ఎంత యినా సరే చెప్పండి" అన్నాడు ఆశగా డాక్టర్ ముఖంలోకి చూస్తూ.

"పిచ్చివాడులా వున్నా వేమిటయ్యా! నువ్వు లక్ష రూపా యలు పోసినా ఆమె రేపు సాయంత్రం దాటి బతకదు. అసలు రేప టికే కష్టం నీకు డబ్బుంటే ఆమె ఉత్తరక్రియలకి వుంచు. వెళ్లు— విసిగించకు నన్ను" అన్నాడు డాక్టర్ నిక్కచ్చిగా

వరదరాజు కళ్లు ఎర్రబారాయి. అతని మెదడులో సమ్మెట పోట్లు ప్రారంభమైనాయి అతను డాక్టర్ వంక ఒకసారి దారు ణంగా చూసి వెనక్కి మళ్లాడు అతని డబ్బు—అతి నెంతో ఆశలు పెట్టుకునివున్న డబ్బు రెండోసారి పరాజయంపొందింది . వసంతం అలా ఆ ఘోరస్థితిలో అంతం కావటమేనా! దీనికి కారణం ఏమిటికి? ఆమెకి పొట్టకూటికి చాలీచాలని డబ్బిచ్చి తమ వరదాలు తీర్చుకున్న పెద్దలు ఏమైనారు? ఆమె నీగతికి తెచ్చిన వాళ్లొక్కళ్ళూ రారేఁ ఇక్కడికి? తనూ వొచ్చేవాడేనా?. ఏదో యాదృచ్ఛికంగా వొచ్చాడు గాని; ఎంత కృతఘ్నులు! ఎంత దారుణం! నవనవలాడే ఆ శరీరం, ఈరోజున కుళ్ళి, ఎముకలు తేడి, ఒక్కొక్క వేళే, ఒక్కొక్క అవయవమే హరించుకు పోతూవుంటే, ఆమె జీవకళ క్షీణంతో, ఆమె ప్రతిరక్తాణువునూ తమ వరదాకోసం తమ సౌఖ్యంకోసం పీల్చిన ఆ మగపురుగులంతా ఏరీ? ఇప్పుడొచ్చిమాత్రం రక్షించగలరా ?...

అతను ఇలాగే ఆలోచిస్తూ, రెండోవార్డు మంచాలుదాటుతూ ఎడం వేపు శోకాలు విని అటు చూశాడు. అతనికి రంగయ్యగారు పెద్దగా కేకలుపెట్టూ మంచంమీద అటూఇటూ పొర్లుతూ వుండడం అతనికి కన్పించింది వెంటనే అటు వెళ్ళాడు.

రంగయ్యగారు మంచానికి పక్కనే ఇంకో మంచం మీద సదానందం, తలనిండా కట్లతో పడుకుని వున్నాడు, అగమ్యమైన స్థితిలో, వరదరాజు అటూ ఇటూ చూశాడు అక్కడే కూచుని శోకాలు పెడ్తూన్న వరలక్ష్మమ్మగారూ, కూతురు జయ, త్రయం బకరావూ కన్పించారు.

అతను త్రయంబకరావుని పలకరించాడు "అయ్యగారికేం కుస్తీ?" అని. అతను సదానందాన్ని ఎరగడు.

త్రయంబకరావు క్లుప్తంగా వినిపించాడు రంగయ్యగారిస్థితిని. "ఏమిటో, మాలోకంలోవున్నా డాయన భాగవతం, అచ్చేయ్యాలో అని తెగ అరుస్తున్నాడు . ఎవడో శాస్త్రీట—అయన్ని మోసం చేశాట్ట. అదొకగొడవ" అన్నాడతను పైగా "ఇంకోటి చూడండి ఈ దురదృష్టంలోనే మేం కుమిలిపోతోంటే, మా బావని రాత్రి మీటింగ్ చెప్పివస్తూంటే ఎక్స్‌పార్టీ వాళ్లు కత్తి పగలగొట్టారు ప్రాణాలమీదికి వొచ్చింది అతనికి. మా అత్తగారికి ఇదంతా చూసి సగం పిచ్చెక్కింది " అంటూ చెప్పుకుపోతున్నాడు

వరదరాజుకి అనుమానం వేసింది . తెల్లారి, తన వార్డులో ప్రత్యర్థిని ఎవరో కొట్టారని విన్నాడు అది ఇతన్నా ! ఇతనా తన ప్రత్యర్థి! రంగయ్యగారి అబ్బాయినా! సన్నగా బక్కపల్చగా ఎంత అందంగా వున్నాడు! ఓరి కిరాతకుల్లారా ! వాళ్లు కొట్టేంత నీచపుపని ఇత నేం చేసివుంటాడు? ఒక వేళ కాదేమో ! ఇతను వేరేమో? అతను త్రయంబకరావు వంక తిరిగి, "ఇతను సత్యనా రాయణ పురంలో ఎలక్షన్‌కిగాని నిలబడ్డాడా?"అని ప్రశ్నించాడు రంగయ్యగారి మంచం వేపు వెళ్తూ

త్రయంబకరావు, "అవునండి!" అన్నాడు ఈయన ఎవరో పెద్దమనిషి చూడ్డానికొచ్చాడుగదా అనుకుంటున్నాడతను అతను ఆరోజు వుదయమే వరలక్ష్మమ్మగారిచ్చిన టెలిగ్రాం అందుకుని భార్యని తీసుకుని వచ్చాడు అతనికేమీ తోచటంలేదు అటు అత్తగారూ, ఇటు భార్యా ఇద్దరూ ఒకటే ఏడ్పూ మొత్తుకోళ్ళూ

వరదరాజు రంగయ్యగారి దగ్గరకెళ్లి నిలబడ్డాడు తికమక పడుతూ అతని మనస్సు ఇప్పటికే చాలా చెడిపోయింది

రంగయ్యగారు, "ఇవ్వాళ ప్రూఫ్‌లు ఏమిటి? . పేమెంటు ఇస్తాడూ? ఒరే శాస్త్రీ నా భాగవతం విలువ నీకేం తెలుసురా! అమ్మాయి! రా అమ్మా, నేను వెళ్తున్నానమ్మా!" అని ఇంకేదో సంబంధం లేకండా వాగుతున్నాడు

వరదరాజు రంగయ్యగారిస్థితిని ఊహించాడు నర్సు ఒకామె వొచ్చి రంగయ్యగారికి టెంపరేచర్ చూసి, పెదవి విరిచి వెళ్తూ వుంటే పిలిచాడు అతను "ఎలా వుంది ? "అని అడిగాడు

"వుందిలెండి చాలా కష్టం " అంటూ వెళ్లిపోయిందామె

వరదరాజు ఇటు తిరిగి తన ప్రత్యర్థివేపు చూశాడు అమా యకంగా, దీనంగా పడివున్నాడతను వరదరాజుకి తల బద్దలై పోతున్నట్టున్నది...

ఇంతలో ఏడుకొండలూ బ్రహ్మానందం లోపలికి వచ్చాడు వరదరాజు నిరామయంగా నుంచున్నవాడల్లా ఏడుకొండల్ని చూడ గానే "చిన్నాకి ఎట్లావుందిరా?" అన్నాడు ఆదుర్దాగా.

ఏడుకొండలు, "గురక పుట్టిందిరా! .. బతకటం కష్టం... వాళ్ళ ఏడ్పు చూడలేక వొచ్చాను. " అన్నాడు.

వరదరాజు ఎగిరి పడ్డాడు "ఎక్కడ వద—చూపించు.. " అంటూ బైటికి పరిగెత్తాడు, ఏడుకొండలు వెనకాలే వెళ్ళాడు రొప్పుతూ. బ్రహ్మానందం సదానందాన్ని చూసి చకితుడై అక్కడే నిలబడ్డాడు

వరదరాజు పిల్లల వార్డులోకి వెళ్ళి చిట్టచివరి మంచంమీద పడుకుని వున్న చిన్నాదగ్గిర కెళ్ళాడు కుర్రాడికి గురక ఎక్కు వగా వుంది. ఒకనర్సు పక్కనే నుల్చుని వుంది. డాక్టర్లూ వైద్య శాస్త్రమూ రక్షించలేని జీవన—మృత్యుసంధిలోవున్నాడు-చిన్నా అతని చిలిపికళ్లు మూతలు పడిపోయాయి, శరీరం బక్కచిక్కి శల్యమై పోయింది

వరదరాజు మంచందగ్గిర కూర్చున్నాడు; అతని కంటివెంబడి, అతని జీవితంలో ఎన్నడూ ఎరగనిది, కన్నీళ్లు పొంగాయి చుట్టూ ఎవరున్నదీకూడా గుర్తించలేదతను భోరున ఏడ్చాడు పదుని మిషాలు అలాగే కూర్చుండిపోయినాడు ఆదేస్థితిలో,

ఏడుకొండలికి తెలుసు వరదరాజు ఆపుత్రాణ్ని ఎంతగా

ప్రేమించింది. అతనికి భారంగానే వుంది మనసు. చిన్నా తల్లీ తండ్రీ మంచం అవతలవేపు నుల్చుని వున్నారు అపరిమితమైన దుఃఖంతో.

అప్పటికి మధ్యాహ్నం మూడుగంటలు దాటింది. నిమిషాలు యుగాల్లాగున్నాయి అక్కడివాళ్లకి. చిన్నా ప్రాణం ఎప్పుడు ఎగిరిపోతుందో అని ఎదురుచూస్తున్నారంతా. ఇక మందులుపని చెయ్యవని పెద్ద డాక్టర్ చెప్పేశాడు.

వరదరాజు కింక అక్కడ పనిలేదు. అతను నెమ్మదిగా లేచి చిన్నావైపుగా వొంగి, వ్యగ్రతీవ్రతలో సహించరాని బాధతో, కుంచించుకుపోయిన ఆ పసివానిబుగ్గమీద ముద్దెట్టుకున్నాడు. మెల్లిగాలేచి నుల్చుని రెండుచేతుల్నీ అంజలి భంగిమలో పెట్టి ఆకాశంవేపు ఎత్తాడు. ఎవర్ని ప్రార్థిస్తున్నాడో! ఏ ఆత్మశాంతికై ప్రార్థిస్తున్నాడో అతను! అతనికి అన్ని ప్రశ్నలకీ ఒక్కదానికీ జవాబులేదు.

# ★ అపస్వరాలు ★

వరదరాజు ఒక్కమాట మాట్లాడకుండా వెనక్కి తిరిగి బయటికి వచ్చాడు. అతని కళ్ళ ఏమీ కనిపిస్తున్నట్టే తోచటంలేదు. తనకేక వినితోనూ నిమిత్తంలేదు. గబగబ వీరుకొండలూ, బ్రహ్మానందం కేకలు వేస్తున్నా వినిపించుకోకుండా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ ఆస్పత్రినుంచి బైటికి నడిచాడు. వేగంగా, పిచ్చెత్తినవాడిలా, తాగినవాడిలా నడక సాగించాడు.

అతన్ని అనుసరించి పరిగెత్తుతున్న వీరుకొండలూ బ్రహ్మానందం, గంటకి మొగ్గలాజపురం కొండమీదిమండపం దగ్గర కొచ్చారు. మండపం ముందువేపు స్తంభాన్నానుకుని విరాగిలా కూర్చున్న వరదరాజు కనిపించాడు వాళ్ళకి. వాళ్ళిద్దరూ మెట్లెక్కి పైకి వెళ్లారు. మండపం సాయంకాలపు బంగారు ఎండలో మెరిసిపోతోంది. పైని అల్లుకునివున్న పిచ్చి తీగలు మెల్లిగా వీస్తున్న గాలికి వూగుతున్నాయి వొయ్యారంగా. లోపల కలకాలంగా నిలబడి నవ్వుతున్న శిల్పసుందరికూడా ఎండ బంగారుకాంతిని వొంటికి అలుముకుని నవ్వుతోంది అలాగే. ఆ మండపం ఆ క్షణాన స్వర్ణమయంగా కన్పిస్తోంది.

వరదరాజు తలవొంచుకుని కూర్చునివున్నాడు నిశ్చలంగా.

బ్రహ్మానందం కొంచెంఆగి, "ఏమండీ, శాస్త్రిగారు మీకోసం ఫోన్ చేశారు...వొస్తారా?" అని అడిగాడు.

వరదరాజు తలెత్తి పకపక నవ్వాడు. ఆ నవ్వు అసహజంగా వుంది. అతనికళ్లు రెండూ ఎండకాంతిలో నిప్పురవ్వల్లా మెరుస్తున్నాయి. "నేను రాను. నేను ఇక ఎక్కడికీ రాను. పొండి... పొండి...నన్ను వెంటాడించకండి" అని గట్టిగా అరిచాడు. ఆవేశంతో.

"ఏందిరా, నీకేమైనా పిచ్చా రోగం! రా, రా, నీతోటి పని వుందది. పార్టీవాళ్ళకి డబ్బు కావాలంట" అన్నాడు వీరుకొండలు, వరదరాజుపక్క నిలబడి.

'డబ్బు' అనేమాట వరదరాజు చెవుల్లో శూలంలా తగిలింది. అతని మెదడులో ఇందాకట్నించి బాదుతున్న సమ్మెట పోట్లు మరింత తీవ్రమైనాయి. "డబ్బురా? డబ్బా! డబ్బుకేం? లక్ష రూపాయలున్నాయి! పిచ్చివెధవ? ఏం చేస్తావురా డబ్బుతోటి?" అంటూ, సమ్రతగా తనముందు నుల్చున్న బ్రహ్మానందం వేపు తిరిగాడు ఉద్రేకంతో, "మీరు చెప్పండి! చెబుతారా? నే నడిగిందానికి సమాధానం?" అన్నాడు అగ్గిలా మండిపడుతూ.

బ్రహ్మానందం వొణికిపోయినాడు. "తెలిస్తే చెబుతానండి" అన్నా డతను. అతని అంతర్యంలో వరదరాజుమీద క్రోధం కొంత అణగివుంది. సదానందాన్ని కొట్టించినది ఇతనేగదా అని అతని వూహ. అదీ అడగాలి....

వరదరాజు అన్నాడు "మీరు వసంతన్నెరుగరుగదూ? ఆమె ఇప్పుడు చావసిద్ధంగా పడివుంది! ఎందుకు? ఆమె కడుపు పుట్టి అట్లా నరకయాతనపడుతూ మూలుగుతూ పడివుంది. ఇప్పుడు లక్ష రూపాయలు పోసినా బతకదట! ఏం? ఆమె నీస్థితికి ఎవరు తెచ్చారు? ఆమె మగాడికి ఆనందమిచ్చేందుకే పుట్టి, వాళ్ళతోటే బతికి, వాళ్ల సరదాలకోసమే ఇప్పుడు ఇట్లా చస్తోంది! పంతులుగారూ? చెప్పండి! ఈ బతికే అందరు ఆడవాళ్లలాగే ఆమె కూడా ఎందుకు ఒకడితోనే బతకలేకపోయింది? ఆమె పొట్ట నిండడానికి వేరే మార్గమే లేకండా చేశారేం? ఎవరి ద్రోహమండీ అది?"

బ్రహ్మానందం వీరుకొండలు చెప్పగా వినివున్నాడు వసంతం సంగతి. కాని ఏం చెప్పగలడు? ఈ ప్రశ్నలకి ఎవరు మాత్రం జవాబు చెప్పగలరు? ప్రోతెల్ అక్టులు సృష్టించేవారైనా, వ్యభిచారం చేసేగాని బతకలేని ఈ సమాజస్థితినిగురించి ఏం చెప్పగలరు?...

వరదరాజు మళ్ళీ అంటున్నాడు. "మీరు చూశారా! చిన్నా! నా చిన్నా! "మామా, మామా" అని ఎవరూ నామీద చూపించనంత ప్రేమ చూపించిన చిన్నా! ఈ నిముషాన ఏం ద్రోహం చేశాడని అట్లా బాధపడుతూ చచ్చిపోతున్నాడు? నేను డబ్బిస్తానంటే వాళ్ళు వొద్దన్నారు. అభిమానపడ్డారు, తీసుకోటానికి. వాళ్ళదగ్గర లేదు. ఆనాడే డబ్బుండివుంటే కుర్రాడు బతికేవాడేమో!...ఇప్పుడు?...చిన్నా చిన్నా!" వరదరాజు ఆగిపోయినాడు. స్తంభానికి చేరగిలబడిపోయినా డతను. అతనిమీదా, మండపంమీదా ఎండకాంతి దివ్యంగా ప్రసరిస్తోంది.

బ్రహ్మానందం, "ఇవన్నీ ఆలోచించే మీరు, ఆ కుర్రాడు సదానందం, మీకేం అపకారం చేశాడని అతన్నలా కొట్టించి చంపటానికి—పురిగొల్పారు?" అన్నాడు మెల్లిగా. అతని కడుపు దహించుకుపోతోంది.

వరదరాజు షాక్ తగిలినవాడిలా త్రాచుపాములా లేచాడు. "ఏమిటి? ఏమన్నారు? నేను కొట్టించానా అతన్ని? నా కసలేమీ తెలియదే! నే నెన్నడూ అతన్నెరగనే! అతన్నెందుకు కొట్టిస్తాను! పంతులుగారూ! మీరు ఆ కసాయివాళ్లని ఎరగరు; వాళ్లు అచ్చంగా డబ్బుకోసమే పుట్టి అందుకోసమే జీవిస్తున్నారు. వాళ్లే అట్లా చేశారు...అంతేనా? ఇతన్ని ఒక్కసారి కొట్టి చంపారు; రంగయ్యగార్ని / ఆయన్నెరుగుదురా! ఎంత పండితుడు! ఆయన ప్రాణాల్ని రక్తాన్ని చుక్కలు చుక్కలుగా పీల్చుకున్నారు... నే నెరగననుకోకండి...ఛీ...ఛీ...పొండి.. పొండి...వీటికి జవాబులు కనుక్కొని నాదగ్గరకి రండి...పొండి..." అని పెద్దగా అరిచాడతను. ఉద్రేకంతో అతను నిలువెల్లా వొణికిపోతున్నాడు.

"ఒరే రా, రా, నువ్వూ, నేనూ అరిస్తే అవుద్దారా?" అన్నాడు వీరుకొండలు.

వరదరాజు భయంకరంగా లేచినిలబడ్డాడు. "పో.. పో... నన్నొదిలి పో. వెళ్లు...వెళ్లు....లేదా, నేనే ఇక్కణ్ణించి..." అంటూ వీరుకొండల్ని మెడ పట్టుకున్నాడు.

లాభం లేదని తెలుసుకున్నారు వీరుకొండలూ బ్రహ్మానందమూ. వాళ్లిద్దరూ మెదలకుండా కిందికి దిగివెళ్లారు. "ఇంకో నలుగుర్ని తీసుకొచ్చి లాక్కుపోదాం పిచ్చోడ్ని. వీడికి మతి చెడ్డది" అన్నాడు, వీరుకొండలు.

"అంతేలే. నిజం తెలుసుకున్నవాడూ, తెలుసుకోవాలనుకున్నవాడూ, మన దృష్టిలో పిచ్చివాడేగా మరి" అన్నాడు బ్రహ్మానందం.

"ఈ వేదాంతం నాకు తెలీదు. రండి తొందరగా. మళ్ళీ వొచ్చి పిచ్చోణ్ణి లాక్కెళ్లాలి" అన్నా డతను వేగంగా నడుస్తూ.

వీరుకొండలు శాస్త్రిగారితో చెప్పి కారుమీద మండపం దగ్గర కొచ్చాడు ఇంకో నలుగురు వాలంటీర్లతో సహా; బ్రహ్మానందం కూడా వెనకే వొచ్చాడు.

సాయంకాలపు రక్తారుణరేఖల భీకర సౌందర్యంలో కింద నిండి ఆ ఎనిమిది స్తంభాల మంటపమూ, తీగలూ మండిపోతున్నట్టు కన్పిస్తున్నాయి.

శాస్త్రి—"నేను పిలిస్తే వొస్తాడులే ...అదంతా తాత్కాలికోద్రేకంలే" అంటూ ముందుగా మెట్లెక్కసాగాడు. మిగతా వాళ్లూ తొందరగా పైకి ఎక్కారు.

మండపం ఖాళీగా వుంది. కాలం తెలియని శిల్పసుందరి మాత్రం నిగనిగలాడుతూ కన్పిస్తోంది. వరదరాజు అక్కడ లేడు.

అతన్ని తీసుకెళ్లటానికి వొచ్చినవాళ్లు దిగ్భ్రాంతులై నిలబడిపోయినారు.

అప్పుడే కాదు; వరదరాజు తిరిగి ఎప్పటికీ వాళ్లకి కన్పించలేదు.

(ఐపోయింది)

# అందని ఆకాశం

పోలాప్రగడ సత్యనారాయణమూర్తి (ప్రహసన)

మా 'శ్రీకాకుళం' కౌన్సిలరుగా నిలబడ్డాడని విని మొదట నేను నమ్మలేదు. ఇదేదో పొరబాటని / ఏ శ్రీకాకుళమో నిలబడితే ఇతనే అన్నారని అనుకున్నాను. కాని 'నిర్లక్ష్యం' కనిపించి ఆ నిలబడింది మన శ్రీకాకుళమే అని చెప్పడంతో నాకు ఆశ్చర్యంతోపాటు వాడి మీద అసహ్యం కూడా వేసింది.

"ఏమిటి నీకీ ధైర్యం? ఇదేం కుళాయి గట్టెక్కి ఉపన్యసించడం, కళ్ళకోటుదగ్గర తీర్పులు చెప్పడం అనుకున్నాడా?" అని 'నిర్లక్ష్యాన్ని' ప్రశ్నించాను.

"ఏమో! ఎవరు చెప్పినా వింటేనా? నువ్వు కాకపోతే మరొకడు నా పేరు ప్రతిపాదిస్తాడని మొండిగా మొదలెట్టే ఏం చెయ్యను?" అన్నాడు 'నిర్లక్ష్యం'.

"ఏమిటి?... వాడిని నిలబెట్టింది నువ్వేనేమిటి? ఏడిసినట్టుంది. ఆ చవటకి బుద్ధిలేకపోతే నీకేమయిందీ?" అన్నాను.

"ఏమో! ఆ విషయం నన్నుకాదు, వాణ్ణే అడుగు" అని నిర్లక్ష్యం విసవిసా వెళ్లిపోయాడు...

ఆ సాయంత్రం శ్రీకాకుళాన్ని వాళ్ళ ఇంటిదగ్గర కలుసుకున్నాను. నన్ను చూసి కంగారుపడి తను చేసినపనికి సిగ్గుపడతాడని ఊహించాను నేను, వాడిలో ఆ చిహ్నలేమీ కనిపించకపోవడంతో చకితుణ్ణయ్యాను. మీదు మిక్కిలి అతి ప్రశాంతంగా "కూర్చో" అని మాత్రం అని మౌనంగా దేన్నిగురించో తీవ్రంగా ఆలోచించసాగాడు.

కొంతసేపయాక "కౌన్సిలరుగా నుంచున్నావట నిజమేనా?" అన్నాను.

అంగీకారసూచకంగా తల ఊపాడు.

"ఏమిటి నీ ధైర్యం?" అన్నా.

సమాధానం చెప్పకుండా మందహాసం మాత్రం చేసి ఊరుకున్నాడు. నాకు ఒళ్లు మండింది. నాలుగు చీవాట్లూ పెట్టి వాణ్ణి తగ్గిద్దాం అనే ఉద్దేశంతో ఇల్లా అన్నాను.

"అప్పులవాళ్లకి తప్ప ఇంకెవరికీ తెలియని అనామక శిఖామణివి నీకు కౌన్సిలరయ్యే పలుకుబడి ఏమి ఏడిసిందిరా? డబ్బయినా దండిగా ఉందా అంటే సెకండ్ హాండ్ కరీంబీడీలే నీదగ్గర ఉండటం గగనం. చదువుమాట సరేసరి. పోనీ పెర్సనాలిటీ అయినా లేదు. ఎవరైనా వింటే నవ్విపోతారు, ఈపాటికయినా ఉపసంహరించుకో."

నా మాట లేవీ వాడికి చెవికెక్కినట్లు లేదు. ఒక్క క్షణం ఆగి చేతిసంచీలోంచి ఒక కరపత్రం తీసి నాకందించాడు. లెదర్ బాగ్ చూసి ఆశ్చర్యంతో "ఇదెప్పుడు కొన్నావ్?" అన్నా.

"అదీ, ఈ పంచీ, లాల్చీ, కళ్ళజోడూ, ఆ చేతికర్రా ఇవన్నీ ఒకసారే కొన్నా. నిన్ననే దినపత్రిక్కి కూడా చందా కట్టాను" అన్నాడు.

వాడి ఎన్నికల హంగామా చూస్తే నాకు నవ్వొచ్చింది. "వీటన్నిటికీ డబ్బెక్కడిది" అన్నా.

"పాత గ్రామఫోను ఉండేదికదూ, అది అమ్మేశా. అది సరేకాని ముందా కరపత్రం చదువు" అన్నాడు.

అందులో ఆరోజున బహిరంగసభ అనీ ఉపన్యాసకుడు 'శ్రీకాకుళం' అనీ ఉంది. ఆ సభకి అధ్యక్షుడుగా నా పేరు ఉంది. కరపత్రంక్రింద "శ్రీకాకుళం నిశానీ" అని నిశానీ బ్లాకు అచ్చువేసి ఉంది. ఈ ప్రహసనంలో నా పేరేవిటనుకొని "నేను అధ్యక్షుడుగా ఉండను" అన్నాను.

"ఉండకపోతే బలవంతం లేదు. కాని వాడనిండా కరపత్రాలు ఇంతక్రితమే పంచిపెట్టబడ్డాయి" అన్నాడు 'శ్రీకాకుళం.'

నాకు ఒళ్లు మండింది. ఈపాటికే ప్రజలందరి దృష్టిలోనూ నేనూ ఒక పిచ్చివాడిగా అయి ఉంటాను. రేపటినుంచి వీధుల్లోంచి వెళుతూంటే "ఫలానా 'శ్రీకాకుళం' సభకి అధ్యక్షుడు"ని నా వెనకాల ప్రజలు అనుకుంటూ నవ్వుకుంటారు. నాకీ ఆలోచనతో తేళ్లూ జెర్రులూ పాకినట్టయింది. "నా అనుమతి లేకుండా నా పేరు ఎందుకు వేశావ్!" అన్నాను తీవ్రంగా.

'శ్రీకాకుళం' నా చేతులు పట్టుకుని బతిమాలుతూ సభని పాడుచెయ్యవద్దనీ, నా భరోసా చూసుకునే తానిందులోకి దిగాననీ, అధ్యక్షుడుగా కుర్చీలో కూర్చుంటే చాలు ఇంకేం చెయ్యక్కర్లేదు, అన్నీ తానే చూసుకుంటాననీ ప్రాధేయపడసాగాడు. సరే చివరకి ఎలాగయితేనేం నేను ఒప్పుకోక తప్పలేదు. తెలిసింది ఎలాగా తెలిసింది ఇంక కుర్చీలో కూర్చుంటే ఏంపోయిందని అంగీకరించాను.

రాత్రి ఎనిమిదింటికి వీధిమొగలో ఒక టేబిలూ రెండువిరిగినకుర్చీలూ ఒక హరికేన్ లైటూ శ్రీకాకుళమే సిద్ధపరచి నన్ను అక్కడికి పిలుచుకువెళ్లాడు. నేను వెళ్లేటప్పటికే పిల్లలూ, పెద్దలూ కలిసి పదిపదిహేనుమంది ఉన్నారు. నేను ప్రశ్నార్థకంగా 'శ్రీకాకుళం' కేసి చూశా.

"నువ్వేం జంకకు. కానిచ్చెయ్యి" అన్నాడు.

నేను లోపల్లోపల విసుక్కుంటూ శ్రీకాకుళంగురించి రెండు పరిచయ వాక్యాలు పలికి కూర్చున్నాను. తర్వాత శ్రీకాకుళం లేచాడు.

"ప్రజల్లారా! ప్రజలన్నానని ఆశ్చర్యపడకండి. సోదరులు కానివాళ్ళని ముఖప్రీతి కోసం సోదరులారా అనీ, మనస్సులో వేరే ఆలోచనలు పెట్టుకొని పైకిమాత్రం సోదరీమణులనీ అనడం నా కిష్టంలేదు. అందుకే అలా సంబోధించాను. నేను నాయుడుగారి పార్టీవాడినీ కాను. పెద్ద కాపుగారి పార్టీ వాడినీ కాను. నాకు ఓటు వెయ్యమని మిమ్మల్ని బెదిరించను. అయినా నాకు కొన్ని అర్హతలున్నాయి. ఆ యోగ్యతల్ని మీకు చెప్తాను. అంతే! మీకు ఇష్టం అయితేనే వెయ్యండి. నేను ఇతరుల సొమ్ము తినెయ్యలేదు. ఎవరి కొంపలూ కూల్చలేదు. ఎవర్నీ మోసం చెయ్యలేదు. ఎవరికీ ఈశ

# ★ అందిన ఆకాశం ★

కారాలుచేస్తానని శుష్క ప్రమాణాలు చెయ్యలేదు. ఇదే నా అర్హతలు.

నేను మీ వార్డు కేవో ఉపకారాలు చేస్తానని వాగ్దానం చెయ్యడంలేదు. కుల తత్వాలు, పార్టీ తత్వాలులాగే వార్డు తత్వాలుకూడా పరిహరించవలసినవే!"

'శ్రీకాకుళం' కంఠం హెచ్చించి మాట్లాడుతూంటే ఆ వార్డులో జనం ఒక్కొ క్కళ్ళు నిద్దరపోతున్నవాళ్లు కంగారు పడుతూ కళ్ళు నులుపుకుంటూ సభాస్థలికి వచ్చి పరిస్థితి చూసి స్థిమితపడ్డారు. వచ్చిన వాళ్లు కాసేపు వినిపోదామని కూర్చుని పోయారు. ఈవిధంగా ఒక అరగంటకల్లా సుమారు ఒక వందమంది శ్రోతలు శ్రీకాకుళానికి లభించారు.

తనకు తెలిసినవి వాళ్ళకి తెలియకుండా ఉండేలాగ ఒక గంట అప్పగించి 'శ్రీకాకుళం' తన ఉపన్యాసాన్ని ముగించాడు. ఇది శ్రోతలలో చాలామందికి దక్కని ప్రహసనానందాన్నిచ్చింది. కొందరు నవ్వుకున్నారు. కొందరు గుసగుసలాడుకున్నారు. మరికొందరు సభ పూర్తి అవగానే శ్రీకాకుళం చుట్టూ ముసిరి తమ పుస్తకాల్లో సంతకాలు పెట్టమని ప్రాధేయపడసాగారు. అతి కష్టంమీద ఆ గండాన్ని తప్పించుకుని 'శ్రీకాకుళం' సభను పరిసమాప్తి చేశాడు. ఈవిధంగా రోజూ ఆ వార్డులో శ్రీకాకుళం హారికేన్‌లైటు మీటింగులు ప్రతి వీధులోనూ సాగుతున్నాయి. జనం విరివిగానే వచ్చేవారట! నేనుమాత్రం ఆరోజు తర్వాత వాడికి కనిపించడం మానేశాను, ఎక్కడ అధ్యక్షుడుగా ఉండవలసివస్తుందో అని.

ఎన్నికల ఫలితాలరోజు రాత్రి వీధులో హడావుడి విని ఇవతలకివచ్చి చూస్తే ఒక సైకిలు రిక్షాలో దండలతో మా 'శ్రీకాకుళం' ఊరేగుతున్నాడు. వాడికి జై కొట్టుకుంటూ సుమారొక వందమంది యువకులు ఉత్సవంలో నడుస్తున్నారు. నన్ను చూసి మా శ్రీకాకుళం మందహాసం చేశాడు...

ఒక రోజున మా యింట్లో పేపరు చూసుకుంటూ కూర్చున్న నాకు మా యింటి ముందు చిన్న కారు ఆగిన చప్పుడు వినిపించింది. పేపరు మడిచి వీధిలోకి చూద్దును కదా కారు డ్రయివరు దిగివస్తూ "అయ్యా కారులో ఛైర్మన్‌గారు మిమ్మల్ని రమ్మంటున్నారు" అన్నాడు.

ఆరోజున ఛైర్మన్ ఎన్నిక అని గుర్తుకువచ్చి "ఎవరు ఎన్నిక అయారు చెప్మా" అనుకుంటూ అలాగే నిలబడిపోయాను. ఇంతలో ఆ కారు తలుపులు తెరుచుకుని మా శ్రీకాకుళం నవ్వుతూ నాకేసి రాసాగాడు. డ్రైవరు చేతులు కట్టుకొని పక్కకు తప్పుకున్నాడు. నేను విస్తుపోయి అలాగే నిలబడిపోయాను.

'శ్రీకాకుళం' లోపలికి వచ్చి మంచం మీదకి చేతిసంచీ కర్రా విసరి కళ్ళజోడు తీసి టీపాయ్‌మీద ఉంచుతూ "అల్లా తెల్లబోతావేం? లోపలికిరా" అన్నాడు. నేను నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ వాణ్ణి సమీపించాను. కూచో అని నన్నొక కుర్చీలో కూర్చొపెట్టి తనింకోదాంట్లో కూచున్నాడు.

ఒక్క క్షణం నిశ్శబ్దం.

"నువ్వు కౌన్సిలరయినందుకే ఆశ్చర్య పోతూంటే ఛైర్మన్‌కూడాఅయ్యావేమిటి?" అన్నా.

"అదంతా ఒక చిత్రమైన కథ. మొత్తం ఇరవైముగ్గురం కౌన్సిలర్లం. అందులో పది కొండుగురు నాయుడుగారిపార్టీవాళ్ళూ పది కొండుగురు పెద్దకాపుగారి పార్టీవాళ్లూను"

"అయితే దేనికీచెందనివాడివి నువ్వొక్క డివే అన్నమాట!"

"మరే - అందులోనూ వాళ్ళిద్దరిబలాలూ సమానంగా ఉన్నాయేమో కథ మరీ రక్తి కట్టింది."

"అవునవును. పైగా లక్షరూపాయ లిచ్చినా ఆ పార్టీలోవాడు ఈ పార్టీలోకి రాడు."

"అదే మనకి లాభించింది. ఏ పార్టీవాళ్లు ఛైర్మన్ కావాలన్నా మన ఓటు అవసరం అయింది. నా ఓటుకి పాట పెరిగింది. పది వేలదాకా పెరగనిచ్చి నేను డబ్బుకి కక్కుర్తి పడే రకం కాదని రెండుపార్టీలకి ఖచ్చితంగా తెలియ చెప్పాను. దాంతో వ్యాపారం మరీ బిగిసింది. ఆఖరికి నన్ను ఛైర్మన్‌గా ఒప్పుకుంటాం అనీ తమ పార్టీ మనిషిగా వ్యవహరించమనీ నాయుడుగారు ప్రత్యేకంగా వచ్చి ప్రార్థించడంతో ఒప్పుకోక తప్పిందికాదు."

"చాలా ఎత్తులే వేశావన్నమాట."

"ఎత్తులేవిటిరా నీ మొహం. నా కసలీ రెండుపార్టీలలో దేనితోటి కలవడమూ ఇష్టంలేదు. ఎందుకు ఒప్పుకున్నానా అని ఇప్పుడు విచారిస్తున్నా."

"అదేవిటి?"

"అవును. వాళ్లకి బుద్ధిలేకపోతే నాకేనా ఉండొద్దూ! అక్షరంముక్క రానివాడిని నేను ఛైర్మన్ ఏవిటి? అందుకే నా గౌరవార్థం చేయబోతూన్న విందుకి వెళ్లకుండా ఇక్కడికొచ్చా."

"నిజంగా నీలాంటి నిరాడంబరుడు ఉండటం అరుదు సుమా!" అన్నాను ఆశ్చర్యంతో అభినందిస్తూ.

"అదేమీ నువ్వు అనుకున్నంత గొప్ప విషయం కాదులే - అది సరేగాని ముందు ఈ ఛైర్మన్ పదవికి నా రాజీనామా రాయి. వేలుముద్ర వేస్తాను" అన్నాడు.

"అదేవిటి?" అన్నా.

"అంతేలే!"

"అదేం?"




"ఇంక ప్రశ్నలు వెయ్యకు. ఒకరోజున నువ్వు చెప్పినట్టు విన్నానా, ఇవాళ వినడానికి? ఊ - రాయి" అన్నాడు శ్రీకాకుళం.

విధిలేక రాశాను. వాడు వేలిముద్రవేసి డ్రైవరుచేకిచ్చి అది కౌన్సిలర్లకీ కమీషనరుకీ అందజేయమన్నాడు. ఆ ఉత్తరాన్ని డ్రైవరు వినయవిధేయతలతో అందుకుని వెళ్ళిపోయాడు.

'శ్రీకాకుళం' మళ్ళీ పూర్వంలాగే క్రికెట్ విషయాలూ అందులో తనకున్న పాండిత్యం మెళుకువలుగూర్చి నేను వినకపోయినా చెప్పుకుపోతూ మధ్యమధ్య కరీం బీడీ ఆరిపోకుండా పీలుస్తున్నాడు. చేతికర్రా, కళ్లజోడూ, లెదర్ బాగ్ ఈమూడూ మంచంమీద పడిఉన్నాయి. నేను వాటికేసి చూసి ఆలోచిస్తూ వాడి మాటలు వింటున్నట్టు నటిస్తున్నా.

ఇంతలో బిలబిలమంటూ పాతిక ముప్ఫయి మంది లోపలికి చొరబడ్డారు. నేను కంగారుగా లేచి నిలబడ్డాను. వాళ్ళంతా కౌన్సిలర్లూ, ఊళ్ళో పెద్దలూను. వాళ్లందరూ శ్రీకాకుళాన్ని బతిమాలసాగారు. ససేమిరా తన నిర్ణయానికి తిరుగులేదని శ్రీకాకుళం బిగిసిపోయాడు. వాళ్లు కాళ్లావేళ్లా పడ్డారు. కాదూ కూడదన్నారు. ప్రార్థించారు. ప్రాకులాడారు. ఏమీ లాభంలేదన్నాడు శ్రీకాకుళం.

తమలో తమకున్న వివాదాలవల్ల తమలో ఎవరూ ఛైర్మన్ అవడం కల్ల అన్నారు. కనుక అందరికీ అంగీకారయోగ్యుడైన అతను ఛైర్మన్ పదవి స్వీకరించి నగర గౌరవాన్ని కాపాడాలన్నారు. అతను అంగీకరించకపోతే అసలు ఛైర్మనే ఉండకపోవడంకానీ తిరిగి ఎన్నికలు రావడంకానీ జరుగుతుందన్నారు. మొదటిదానివలన మునిసిపాలిటీ అపహాస్యంపాలవుతుందన్నారు. రెండవదానివల్ల కౌన్సిలరుగా ఎవరూ నిలబడకపోవడమనే మహాప్రమాదం సంభవిస్తుందనీ పట్నంలో ప్రశాంతత నశిస్తుందనీ అన్నారు.

"నే నింతగొడవ అవుతుందంటే అసలు నిలబడకేపోదును తెల్సా" అన్నాడు శ్రీకాకుళం.

'ఛైర్మన్‌పదవిని మీరు అంగీకరించేదాకా మేం ఇక్కడినుంచి కదలం' అన్నారువాళ్లు. అని అక్కడేకూచుని సత్యాగ్రహం మొదలెట్టారు.

కొంతసేపయాక "ఇదెక్కడిసంతయ్యా! నాకు వద్దు మొర్రో అంటే వదలరేం!" అన్నాడు శ్రీకాకుళం.

వాళ్లలో ఎవరూ కసకలేదు.

ఆఖరికి విసుక్కుంటూ "సరే లేవండి" అంటూ శ్రీకాకుళం చేతికర్రా, సంచీ, కళ్ళజోడూ అందుకుని లేచాడు - ★

# 'టు లెట్'

## తాళ్లూరి నాగేశ్వరరావు

[శోభనాద్రిరావుగారి డాబాముందు గది. గదిమధ్యలో ఒక టేబులూ, చుట్టూ మూడుకుర్చీలూ వుంటాయి. ఎదురుగ్గా ఉన్న ద్వారానికి అందమైన కర్టెనూ, ఇంకో కుడి వైపుకు ఒక ద్వారం - అది పెరట్లోకి దారి తీస్తుంది. గోడకు బర్మా - షెల్ వారి క్యాలెండరూ, రెండు దేశనాయకుల ఫోటోలూ వుంటాయి. ఎదురుగ్గా ఉన్న ద్వారంపైన క్లాక్ పదకొండు గంటలు చూపుతూ వుంటుంది. శోభనాద్రిరావు కుర్చీలోకూర్చుని ఏదో ఆలోచిస్తూ వుంటారు. ఆయన భార్య సీతారావమ్మ ఒక పత్రిక తిరగవేస్తూవుంటుంది. ఇద్దరివయస్సు దాదాపు నలభై, యాభై సంవత్సరాలమధ్య వుంటుంది.)

సీతారావమ్మ: నిన్న ప్రొద్దునన గా బయట బోర్డు కట్టాడు అబ్బాయి. ఇంకో అద్దె ఇంటికోసం ఎవ్వరూ రాలేదేమండీ!

శోభనాద్రిరావు: (ఆలోచన్నుంచి తేరుకొని) ఆఁ!...ఏమిటి?

సీతా: అదే! ఇంకా అద్దె ఇంటికోసం ఎవ్వరూ రాలేదేమిటి?

శోభ: వొస్తారు. వాళ్ళకి లేని తొందర మనకెందుకు? అయినా మన ఇంట్లో 'అద్దెకెవ్వరూ ఉండరు' అన్న భయం మనకెందుకు? ఈ పేటలో ఇంత మంచి వసతులు గల ఇల్లు లేదని ఈ పేటలో వాళ్ళకే కాకుండా - ఈ ఊళ్ళోకూడా చాలమందికి తెలుసు.

సీతా: అయినా అద్దె ఎక్కువని చాలమంది దడుస్తారుసుమండీ! నిండా మూడుగదులు లేవు- ముప్ఫై రూపాయలా! అంటారు. నీటివసతీ, గాలివసతీ, ఇరుగూ పొరుగూ మంచితనమూ - ఈ రోజుల్లో ఎవరికి అక్కరబట్టింది? ప్రతివాడూ అద్దె ఎక్కువనేవాడే! మొన్న ఉండిపోయిన చెన్నకేశవులుగారు మటుకు మొదట్లో అద్దె ఎక్కువని అఘోరించినవాడేగా! చివరకి రానురాను - ఇంత మంచి ఇల్లు లేదని ఆయన నోటిమీదగానే అన్నాడుగా. అంతలో ఉంది!

శోభ: అవును. అన్ని హంగులూ ఉన్న ఇల్లు అంత చవుగ్గా దొరకాలంటే ఎట్లా దొరుకుతుంది? ఇదేమన్నా సత్రం గనుకనా-

సీతా: మరే! నాకుమటుకు ఈ తభా ఒక్క మొగుడూ, పెళ్లాం, ఒక్క నలుసూ గలవాళ్ళకి అద్దెకు ఇవ్వాలని ఉంది. నలుగు రైదుగురు పిల్లలు ఉన్నదగ్గర్నుంచీ - వాళ్లు చేసే గోలకు మన చెవులు చిల్లులుపడతాయి. మనం ముందుగానే ఇటువంటివన్నీ విచారించి అద్దెకు ఇవ్వాలి.

శోభ: అవును.

సీతా: ఇదివరలో బోర్డుకట్టినప్పుడు సాయంత్రానికే ముగ్గురు ఉద్యోగస్థులు తమకు కావాలంటే తమకు కావాలని వొచ్చారు. ఈ తభా 'అద్దె ఇల్లు ఖాళీగా ఉందాండీ!' అంటూ వొచ్చినవాడు ఒక్కడూ లేడేమండీ! ఈ బస్తీకి కొత్త వాళ్లు ఎవ్వరూ బదిలీ కాలేదా?

శోభ: బోర్డు అందరికళ్లా పడవొద్దూ!

సీతా: చిత్రంగా మాట్లాడుతున్నారే! మన ఇల్లు రోజుకు వేలమంది నడిచే రోడ్డు మీద ఉంది. ప్రతి ఒక్కడి రెండుకళ్ళూ అర్ధరూపాయి ఇచ్చి వ్రాయించుకొచ్చిన అందమైన 'టు లెట్' బోర్డుమీద పడకుండా వుంటాయా?

శోభ: ఏడ్చి ముఖం తుడుచుకున్నట్టుంది-నీవు అనేది. పోతేవాళ్ల కళ్లు ఎన్ని పడతేనేం? అద్దె ఇల్లు కావాల్సినవాడు చూడవద్దూ!

సీతా: ఆ మాటా నిజమే!

శోభ: అబ్బాయి బజారుకెళ్ళాడుకదూ! ఇంకా రాలేదేం? ఇవాళ ఆఫీసు లేదూ!

సీతా: ఇవాళ ఆదివారం కదూ!

శోభ: ఓహో! ఒకో సంవత్సరం పైబడినకొందికీ మతిమరుపు కూడా జాస్తి అవుతూన్నది.

[వెంకట్రావు ఆదుర్దాగా వస్తాడు. శోభనాద్రిరావుగారి కొడుకు. వయస్సు ఇరవైరెండేళ్లు. ఉద్యోగస్తుడు.]

వెంకట్రావు: అమ్మా, కొత్తగా వచ్చిన మా ఆఫీసు మేనేజరుగారు వస్తున్నారు. వారికి అద్దెయిల్లు కావాలిట. మన ఇంట్లో ఒక భాగం ఖాళీగా వుందని చెప్పాను. చూసుకోనేందుకు వస్తున్నారు.

సీతా: ఇప్పుడే—



ఆదిదంపతులు

శిల్పలేఖనం— సి. సంపత్కుమార్.

వెంక: ఊఁ! నువ్వు ఇంట్లోకి వెళ్లు. నాన్నా! వారు చాలమంచివారు. కుటుంబం పెద్దగా లేదు. ఆయనా, భార్యా, ఇద్దరు పిల్లలూ—అంతే!

శోభ: సరే! అలాగైతే! ఎవరైతేనేం మనకు అద్దె ఇచ్చేప్పుడు.

వెంక: అవుననుకో. కాని ఒక్క అయిదు రూపాయలు తగ్గించి యిద్దాం.

సీతా: (లోపల్నుంచి) అదెల్లారా?

వెంక: అవునమ్మా! నేను పైకి పోవటానికి ఆయనతో అవసరం ఉంది నాన్నా!

శోభ: కాని ఇప్పుడు మనం పాతిక రూపాయలకు యిస్తే అదే రివాజైపోతుందేమోనని.

వెంక: రివాజేమిటి? మన ఇష్టం. ఒక అయిదు రూపాయలు ఎక్కువ ఇమ్మనొచ్చూ, తక్కువా ఇచ్చుకోవచ్చూ!

(మేనేజరు కృష్ణమూర్తి వస్తాడు. ప్రక్కన ప్యూనుకూడా వుంటాడు.)

వెంక: రండి. రండి!

శోభ: అలా కూర్చోండి.

వెంక: అమ్మా! కాఫీ తీసుకురావే!

కృష్ణమూర్తి: అక్కరలేదు లెండి. ఇప్పుడే భోంచేసి వొచ్చాను.

శోభ: నడిచివొచ్చేరేమో! ఆయాసంగా వుండివుంటుంది. చల్లని మంచినీళ్లయినా పుచ్చుకోండి.

(వెంకట్రావు లోపలకు వెళ్ళి వెండి గ్లాసుతో మంచినీళ్లు తీసుకువస్తాడు. కృష్ణమూర్తి త్రాగుతాడు)

శోభ: తమరు ఇదివరకు ఎక్కడ పనిచేశారండీ?

కృష్ణ: బందరులో నాలుగుసంవత్సరాలు పనిచేశాను. అంతకుముందు ఏలూరులో.

శోభ: తమకు ఇల్లు చాలుతుందో లేదో మొత్తం మూడుగదులు. మధ్యలో హాలూ.

కృష్ణ: చాలక మేం ఎంతమందిమి లెండి. ఇద్దరు పిల్లలతోసహా మొత్తం నలుగురం.

శోభ: నీటికి ఇబ్బందేం లేదు. పెరట్లో నే పైపుకుళాయి. గదులకు తగినంత వెంటిలేషన్ ఉంది. కరెంటు ఉంది మీభాగానికి ప్రత్యేకంగా మీటరుకూడా ఉంది. వేసవికాలం చల్లగాలికి రాత్రిళ్లు పెరట్లో మంచాలు వేసుకోవొచ్చు. కొబ్బరిచెట్లనుంచి చల్లని గాలి వొస్తుంది.

వెంక: అదంతా చెప్పాలా నాన్నా!

శోభ: అవునురా. ఎరుగనివాళ్ళకు చెప్పవొద్దూ.

కృష్ణ: చెప్పటం మంచిదే లెండి.

శోభ: తరువాత? ఈ పేటలో దొంగ భయం చాల తక్కువ. ఒకవేళ మీరు ఇల్లు తాళం వేసుకొని అంతా సినిమాకు వెళ్ళినా ఏంభయం లేదు. ఇరుగు పొరుగు అంటారా స్నేహానికీ, మంచితనానికీ - వొంక పెట్టనవసరం లేదు. అవతల తహశీల్దారు గారు ఉంటున్నారు. ఇవతల ఇన్సూరెన్సు కంపెనీ ఏజంటుగారు ఉంటున్నారు. వీధికి ఎదురూగ్గా హైస్కూలు హెడ్ మాస్టరు వంకటరామనాథంగారు కుటుంబ సమేతంగా ఉంటున్నారు. ఒకవేళ మీరు నాలుగైదురోజులు క్యాంపు కెళ్ళినా ఇంటిదగ్గర ఆడంగులకు ఏం భయం అక్కర్లేదు.



శాక్యముని

నఖలేఖనం—సి. సంపత్కుమార్.

కృష్ణ: (ఆలకిస్తూ) మంచిదే.

శోభ: అబ్బాయ్. వారికి ఇల్లు చూపించు.

వెంక: రండి! ఇటు—

[కుడివైపు ద్వారంనుంచి ఇంటిలోని భాగం చూచేందుకు కృష్ణమూర్తిగారూ, ప్యూనూ, వెంకట్రావూ వెళతారు. ఎదురూగ్గా గుమ్మంలోంచి సీతారావమ్మ వస్తుంది.]

శోభ: 'ఇంకా ఎవరూ రాలేదేం? ఇంకా ఎవరూ రాలేదేం?' అని తొందరపడుతూంటివే - చూడు. వచ్చారుగా.

సీతా: మనిషి వాలకంచూస్తే కాస్త

మం త్రతి రకం బాగానే ఉంది. మరి భార్యా మణిగారు ఎలా ఉంటుందో——

శోభ: ఎలా ఉన్నా మనం వారికి అద్దెకు ఇవ్వక తప్పదు. అబ్బాయికి వారివల్ల జరగ వలసిన సహాయం ముందు ఉంది.

సీతా: ఏమైనా మనం వారితో అతి చను వుగా ఉండరాదు. అతి మంచికీ, స్నేహా నికీ, మెప్పుకూ పోతే - నెల నెలా అద్దె సక్రమంగా ఇవ్వటం మర్చిపోవొచ్చు.

శోభ: ఆ సంగతి నాకు తెలుసు.

సీతా: మనం అద్దెకున్న వాళ్లతో ఎంత వరకు బెట్టుగా ఉండాలో అంతవరకు ఉండటం ముఖ్యం.

శోభ: (విసుగ్గా) ఆ సంగతీ నాకు తెలుసు.

[ఎవరో ఒక మధ్యవయస్కుడైన వ్యక్తి ప్రవేశిస్తాడు. ఎదురుచూపులు చూస్తూం టాడు.]

శోభ: ఎవరండీ? ఎవరికోసం? ఏం పని మీద వచ్చారు? ఎవరు మీరు?

వొచ్చిన వ్యక్తి: బయట 'టు లెట్' బోర్డు చూసి వొచ్చానండీ! నాకు ఒక అద్దె ఇల్లు కావాలి. ఏ భాగం ఇస్తారు? అద్దె ఎంత?

శోభ: సారీ. అద్దెకు ఇచ్చేశామండీ! మీరు రెండు గంటలు ముందు వొచ్చిఉండ వలసింది.

వొ. వ్య: (ఆశ్చర్యం కనబరుస్తూ) ఇచ్చే శారూ! ఖర్మ! ఇక్కడికి వద్దామని ఎనిమిది గంటలకే బయలుదేరానండీ. కాని మధ్యలో చౌక్ దగ్గర ఒక ఫ్రెండ్ కనబడి తన ఇంటికి లాక్కెళ్లాడు. అక్కడ్నుంచి వొచ్చేప్ప టికి యీ వేళ అయింది. ఇంత అన్యాయం జరుగుతుందనుకోలేదు.

సీతా: అయ్యో! పాపం——

వొ. వ్యక్తి: నిన్న సాయంత్రం ఆ బోర్డు చూసినదగ్గిర్నుంచీ నా మనస్సంతా ఇక్కడే వుంది సుమండీ. ఆ పేటలో ఇరుకు కొంపలో ఉండి నానా బాధలు పడుతున్నాను. నరకంనుంచి విముక్తి పొంద వచ్చునని గంపెడాశతో వొచ్చాను. కాని మీరు ఎవరికో రెండు గంటల ముందే ఇచ్చే శామంటున్నారు. ఎంతకు ఇచ్చారండీ?

శోభ: ముప్ఫై రూపాయలు.

వొ. వ్య: ముప్ఫై రూపాయలే!

శోభ: అవును. ఆయన చాల చవగ్గా దొరికిందనుకొని వెంటనే బయానా కూడా ఇచ్చి వెళ్ళాడు. ఈరోజుల్లో యిన్ని వస తులుగల ఇల్లు...

వొ. వ్యక్తి: అవును! అవును...... వొస్తాను.

(వొచ్చిన దారినే నిష్క్రమిస్తాడు)

సీతా: 'అన్ని వసతులూ ఉండాలి. అద్దె చాల తక్కువగా ఉండాలి' ప్రతివాడికీ ఉన్న ఆశే ఇది.

శోభ: అవును. అది సహజమే!

[వెంకట్రావు వొస్తాడు. సీతారావమ ఇంట్లోకి వెళుతుంది. తరువాత కృష్ణమూర్తి వ్యాసా వొస్తారు]

శోభ: ఎలా ఉంది భాగం? నచ్చిందా అండీ!

కృష్ణ: నచ్చక ఏముంది లెండి? అసలు ఈ బస్తీలో అద్దెకు ఇచ్చే మంచి కొంపలే లేవు. ఉన్నవాటిల్లో మీది నాకు బాగానే ఉన్నట్టు అగపడుతూంది.

శోభ: బాగా సెలవిచ్చారు!

కృష్ణ: మీరు చెప్పారుగా! మీమాటలు విన్న తరవాత, మీ మాటలమీద బాగా విశ్వాసాన్ని కుదుర్చుకున్నాక నాకు ఇక్కడే ఉండాలనిపిస్తోంది.

శోభ: మంచిది.

కృష్ణ: అయితే ఎప్పుడు వచ్చి చేర మంటారు?

శోభ: అది మీమీ అవకాశాలను బట్టి ఉంటుంది. ఇల్లు ఎప్పుడూ అద్దంలాగానే ఉంటుంది. తిథి వార నక్షత్రాదుల మంచి చూసి మీరు ఎప్పుడైనా చేరవచ్చు.

కృష్ణ: అలాగైతే బ్రాహ్మణ్ణి కను క్కొని చెబుతాను.

శోభ: అంతవరకూ దేనికండి? ఎల్లుండి శుక్రవారం వొచ్చి చేరండి! దివ్యమైన దినం.

కృష్ణ: సరే! పెద్దలు - మీ మాట తీసి వేయడం దేనికి? ఇక, ఇకపోతే - మిగిలింది ల్లా...అద్దె విషయం.

శోభ: దానిదేముంది లెండి.

కృష్ణ: అలా కాదు.

వెంక: మీలాంటివారిదగ్గర మా నాన్న కు అద్దె రేటు చెప్పే అలవాటు లేదండి. వారి వారి చిత్తానికి తోచినంత ఇవ్వగా తీసు కోవటమే.

కృష్ణ: మీరు అట్లా అంటే నాకు బాగుండదు. మంచితనం మంచితనమే—— వ్యవహారం వ్యవహారమే!

వెంక: అవుననుకోండి.

కృష్ణ: అవుననుకోవట మేమిటి? ఇది వరకు ఈ భాగానికి మీరు ఎంత అద్దె పుచ్చు కొనేవాళ్ళు?

శోభ: ఆఁ! ఎంతలెండి...

కృష్ణ: ఖచ్చితంగా చెప్పండి.

శోభ: ఇంతకుముందు ఉండి వెళ్ళినవారు నాకు పాతికరూపాయలు ఇచ్చేవారు.

కృష్ణ: నేనూ అలా ఇస్తాను. పుచ్చు కోండి.

వెంక: మీకు అది ఎక్కువ అద్దెగా అగ పడుతుందేమో నని మాభయం.

కృష్ణ: నేనూ అలా ఇస్తాను. పుచ్చు కోండి.

**వెంక:** మీకు అది ఎక్కువ అద్దెగా అగపడుతుందేమోనని మా భయం.

**కృష్ణ:** ఎక్కువ అద్దె? నేను బందర్లో ఉంటేగా నలభైరూపాయల అద్దె ఇంట్లో ఉండేవాడ్ని.

**శోభ:** ఓహో!

**కృష్ణ:** ముందుగా బయానా తీసికోనే రివాజు ఉందాండీ?

**శోభ:** ఆఁ! అదేం లేదులెండి. మాటమీద నమ్మకమే!

**కృష్ణ:** అయితే నేను వెళ్ళివస్తాను.

**శోభ:** }
**వంక:** } మంచిది.

**కృష్ణ:** మీరు అన్నట్టు ఎల్లుండి శుక్రవారమే వొచ్చి చేరతాను!

**శోభ:** సరే. మీ ఇష్టం. అలానే రండి. మీరు వచ్చేప్పటికి ఇల్లు పరిశుభ్రంగా వుంచుతాము.

**కృష్ణ:** వొస్తానండి.

**శోభ:** మంచిది.

[వెంకట్రావూ, కృష్ణమూర్తీ, పుల్లయ్యనూ బయటికి వెళతారు. శోభనాద్రిరావు బయటి గుమ్మంవరకూ వస్తాడు]

## 2

[ఆ మరునాడు. అంతా మొదటిరంగంలాగానే ఉంటుంది. సమయం పదకొండు గంటలు. శోభనాద్రిరావుగారూ, సీతారావమ్మా కుర్చీలలో కూర్చొని వుంటారు. అప్పుడే పోస్టుమాన్ వచ్చి ఒక ఉత్తరం ఇచ్చి వెళతాడు]

**సీతా:** ఎక్కడ్నించి వొచ్చిందండీ ఆ ఉత్తరం?

[ఇంట్లోంచి వెంకట్రావు ప్రవేశిస్తాడు]

**వెంక:** మామయ్యదగ్గర్నించా?

**సీతా:** చదవండి.

**శోభ:** (కవరు చించి చదవ నారంభిస్తాడు).

"శ్రీ శోభనాద్రిరావు బావగారికి —

నమస్కారములు చేసి వ్రాయునది ఏమనగా. ఇక్కడ అంతా క్షేమము మీ క్షేమసమాచారములు తెలుపగోరెదను. నాకు హఠాత్తుగా మీవూరు బదిలీ అయినది. అంతా అనుకోకుండా ఆకస్మికముగా జరిగినది. అందుకు ఒక విధముగా సంతోషించవలసినదే! మనమంతా ఒక్కచోట ఉండవచ్చును. మీ ఇంట్లోని భాగం నాలుగైదు రోజుల క్రితం ఖాళీ అయినదని నిన్న నాకు మీ ఊరినుంచి వచ్చిన మిత్రుడు చెప్పటం వలన తెలిసింది. కనుక ఆ భాగాన్ని ఎవ్వరికీ అద్దెకు ఇవ్వకుండా అట్టే పెట్టవలసింది. సెలవు చేసికొని సాధ్యమైనంత త్వరలో కుటుంబసమేతంగా వచ్చెదను.

ఇట్లు

మీ. శ్యామసుందర శివప్రసాద్."

**వెంక:** (ఆశ్చర్యంతో తల్లక్రిందులై) మై గాడ్ ఇప్పుడు ఏం చేయటం?

**శోభ:** పెద్ద చిక్కు వొచ్చి పడిందే!

**సీతా:** ఆ వచ్చే ఉత్తరమేదో నిన్న వొచ్చినా బాగుండేది.

**వెంక:** ఇప్పుడు ఏం చేయడం నాన్నా! అద్దెకు ఇచ్చేశామని మామయ్యకు రాస్తే!

**సీతా:** అదెట్లారా? అంతా ఒకచోట వుందామని వాడు సంతోషపడుతూంటేనూ!

**వెంక:** అయితే ఏం చేయమంటావు! నిన్న అద్దెకు ఇస్తామని చెప్పి. ఇవాళ ఇవ్వటానికి వీలు లేదంటే, ఆ పెద్దమనిషి ఏమనుకుంటాడు? అదేమన్నా మర్యాదగా వుంటుందా?

**శోభ:** ఆ మాటా నిజమే.

**వెంక:** లేకపోతే మనమే మామయ్యకు ఇంకో ఇల్లు మాట్లాడకూడదూ.

**శోభ:** మాట్లాడవచ్చు. కాని వాడు మన చెంతనే ఉండాలని ఉబలాటపడుతున్నాడు.

**సీతా:** మనదగ్గర ఉంటేనే మంచిది. మంచీ చెడ్డా చూస్తూ వుండవచ్చు.

**వెంక:** మరి, ఆ పెద్దమనిషికి మాట యిచ్చాముగా.

**సీతా:** మాట ఇస్తేనేం? "మావాళ్లు వస్తున్నారు. మీరు ఇంకో ఇల్లు చూసుకోండి" అని చెప్పేస్తే పోలేదూ.

**వెంక:** అదే! అట్లా ఏముఖంతో చెప్పటమూ అని.

**సీతా:** కాస్త బాధపడుతూ చెపితే సరి. ఎంతో అవసరంమీద ఇట్లా చేయవలసి వస్తూందనీ, కాకపోతే మేం కూడా ఈ ఊళ్లో మంచి ఇళ్లు వెతికి పెడతామనీ చెపితే సరి. మన అవసరాన్ని గుర్తించకపోతాడా?

# ★ 'టు లెట్' ★

శంక: వీం గుర్తించినా—మాట నిలబెట్టుకోలేనివాళ్లమవుతాము.

శోభ: నాకు ఒక ఆలోచన తడుతూంది.

వెంక: ఏమి టది?

శీతా: ఏమిటి?

శోభ: ఆ ప్రకారం చేస్తే ఆయనే 'ఈ ఇల్లు నాకు వొద్దు బాబో!' అని చేతులు ఝాడించి ఆమడదూరం పడతాడు.

వెంక: ఏమిటి నాన్నా ఆ ఆలోచన?

శోభ: ఏముంది? 'మా ఇంట్లో క్షయరోగి ఉన్నాడు. క్షయరోగం అసలే అంటువ్యాధి. ఆ సంగతి మీకు ముందుగా చెప్పకపోవడం మాదే పొరపాటు. ఆ రోగి దగ్గు పెద్ద డిస్టర్బెన్సు. మీకు ఇష్టమైతే మాదేం అభ్యంతరం లేదు. ఉండొచ్చు' అని ఆయనతో నువ్వు చెప్పు. ఇంకో ఆయన మన ఇంటి చాయలకు వొచ్చేందుకు ప్రయత్నిస్తాడా?

శీతా: నిజమే! మంచి ఆలోచన!

శోభ: ఏమంటావురా?

వెంక: అట్లా చేయడమే మంచిది. భయపడి మరో ఇల్లు చూడమంటాడు.

శీత: క్షయరోగమంటే ఎవరికైనా భయమే! కాని ఆ విషయం నమ్ముతాడో లేదో. మన ఇంట్లోని మనుషుల సంగతి తెలుసేమో!

శోభ: ఎట్లా తెలుస్తుంది? వీంరా నువ్వేమైనా చెప్పావా?

వెంక: లేదు నాన్నా!

శోభ: 'మా అన్నయ్య క్షయజబ్బుతో మూడు నెలలుగా తీసుకుంటున్నాడు' అని చెప్పు.

వెంక: తరువాతైనా ఈగొప్ప అబద్ధాన్ని తెలుసుకుంటాడేమోనని భయంగా ఉంది.

శోభ: భయం దేనికి? ఎవరు చెబుతారు? అబద్ధమాడటంలో నేరమేముంది? అదిచెప్పనిదే—వ్యవహారం నడవదుగా. మర్యాదగా బ్రతకాలన్నా, గౌరవంగా బ్రతకాలన్నా, నలుగురు చేత 'మంచి' అనిపించుకోవాలన్నా, ధనం సంపాదించాలన్నా - ఈ రోజుల్లో అబద్ధమాడటం ముఖ్యంగా! ముక్కుకు సూటిగా పోతేనూ, భూమి గుండ్రంగా ఉందని నమ్మితేనూ — ఈ రోజుల్లో మన పనులు అవుతాయా? ఎప్పటికీ - వీదో విధంగా నీతినుంచీ, నిజాన్నుంచీ తప్పించుకొని - కాలుమీద కాలు వేసుకొన్నవాడికే సుఖం. నీ కెందుకు నువ్వు అలా చెప్పరారా!

వెంక: అయితే ఇప్పుడే వెళ్ళివస్తాను.

శోభ: వెళ్లు. ఆ చెప్పేటప్పుడు ముందు కొత్త ఆ విషయం చెప్పవలసి వచ్చినందుకు బాధపడుతూన్నట్టునటించు. తరువాత అసలు విషయాన్ని చెప్పు. క్షయరోగం - అంటే ఎటువంటిదో శూడా రెండు ముక్కల్లో వాళ్లింతా భయం కమ్ముకు నేట్టు చెప్పు. ఊఁ! వెళ్లు.

(వెంకట్రావు వెళతాడు).

శీతా: మంచి ఉపాయమే ఆలోచించారు?

శోభ: ఆలోచించకపోతే ఎలా?

శీతా: నిజంగానే భయపడి ఇల్లు వొదులుకుంటా డంటారా?

శోభ: సందేహమా?

(ఎవరో వ్యక్తి లోపలకు ప్రవేశిస్తాడు. బుర్రమీసాలు, వల్లెవాటు పంచా, గంభీరంగా వుంటాడు)

శోభ: ఎవరికోసమండీ! ఏం పనిమీద వచ్చారు?

వొ. వ్య: బయట టు లెట్ బోర్డు చూసి వొచ్చానండి. మాకు ఒక ఇల్లు అద్దెకు కావాలి. ఈ ఇంట్లో వీ భాగం ఇస్తారో...

శోభ: నిన్న ఉదయమే ఇల్లు అద్దెకు ఇచ్చేశాం. ఖాళీగా ఉన్న భాగం ఏమీ లేదు.

వొ. వ్య: మరి ఇంకా బోర్డు బయట వుంచారేం?

శోభ: మాదే పొరపాటు.

వొ. వ్య: అలాగా. ఇల్లు దొరికిందిగదా అని ఎంత ఆశతో వొచ్చాను!

శోభ: కావొచ్చు.

వొ. వ్య: ఇక వెళ్లొచ్చుంటారా?

శోభ: ఊఁ! ఒకరోజు ముందుగా వచ్చి ఉండవలసింది.

(కొత్తగా వొచ్చిన ఆ వ్యక్తి వొచ్చిన దారిని వెళతాడు)

శోభ: అంతా చేజారిపోయిన తరువాత అఘోరించేవాళ్ళే ఇల్లు ఖాళీగా ఉన్న నాలుగురోజులవరకూ ఒక్కడు వచ్చాడూ. అంతా సెటిల్ అయిపోయాక అందరూ విచారించేవాళ్లే!

శీతా: మరే! అది సరేకానీయండి. ముందు బయటఉన్న ఆ 'టులెట్' బోర్డు కొస్త తీసివేయండి. లేకపోతే ఈ అద్దె ఇళ్ళకోసం వొచ్చేజనానికి సమాధానం చెప్పలేక సతమతమైపోతాం.

శోభ: నిజమే!

[శోభనాద్రిరావుగారు బయటకెళ్ళి ఆ బోర్డు తీసుకొచ్చి డ్రాయరుమీద వేస్తారు. అంతలో వెంకట్రావు ప్రవేశిస్తాడు]

సీతా: ఏరా, అప్పుడే వొచ్చావు? ఆయన అగుపించలేదా?

వెంక: అగుపించాడు. బజారుహోటల్లో నే అగుపించాడు. కాఫీ త్రాగాక మెల్లిగా అసలు విషయం చెప్పాను. కనుబొమలు రెండూ ఒకచోటచేర్చి కొంతసేపు ఆలోచించాడు. చివరకు అన్నాడు: తనకి క్షయజబ్బంటే మహాభయమనీ, తనకి ఇంకో ఇల్లు చూడవలసిందనీ. అలాగేనని చెప్పి ఇవతల కొచ్చాను. నాన్నా! మొత్తానికి భలే పన్నుగడ పన్నావు.

శోభ: (నవ్వుకుంటాడు)

## 3

[వారంరోజులతరువాత. సమయం పదకొండుగంటలు. అలంకరణ పూర్వరంగంలాగాక ఉంటుంది. శోభనాద్రిరావుగారు ఏదో పత్రిక చదువుతుంటూ వుంటారు. అంతలో పోస్టుమాన్ వొచ్చి ఒక ఉత్తరం ఇచ్చి వెళతాడు. చదువుకొని ఆశ్చర్యపోతారు శోభనాద్రిరావు గారు]

శోభ: (తనలో) ఎంతపని జరిగింది! ఓసేవ్ - నిన్నే నే!

సీతా: (లోపల్నుంచి వస్తుంది) ఏమిటండీ?

శోభ: నీ తమ్ముడిదగ్గర్నుంచి ఉత్తరం వొచ్చింది.

శీతా: ఏదీ, ఏమని రాశాడు? ఎప్పుడు బయలుదేరి వొస్తామన్నారు?

శోభ: ఒకటే రావటం —

శీతా: (ఆశ్చర్యంగా) ఏం?

శోభ: (ఉత్తరం చదువుతాడు)

"శ్రీ శోభనాద్రిరావు బావగార్కి — నమస్కారములు చేసి వ్రాయునది ఏమనగా—అంతా క్షేమం - మీ క్షేమసమాచారములు తెలుపగోరతాను. కాని ఇదివరలో నేను రాసినట్టు జరగలేదు. మళ్ళీ నన్ను మీ ఊరు వెళ్ళకముందే మార్చి ఇక్కడికే వేశారు. మన చేతులో ఏముంది? నేను మీవూరు రావటంలేదు మీ ఇల్లు అద్దెకు ఇచ్చుకోండి. ఇంతే సంగతులు.

ఇట్లు

పా. శ్యామసుందర శివప్రసాద్."

శీతా: అయ్యో! వాళ్లు వస్తారని, అబద్ధాలాడి కృష్ణమూర్తిగారిని ఇంటికి రాకుండా చేశామే!

శోభ: మీ తమ్ముడు సామాన్యమైనవాడా!

శీతా: పోనీలెండి. ఇప్పుడు మనకు వచ్చిన నష్టమేముంది? మన పైకి రూపాయలకి మళ్లీ అద్దెకు ఇచ్చుకోవచ్చు. మనకి అద్దె వాళ్లు రారని భయమా? మళ్లీ ఆ బోర్డు బయట గోడకు తగిలించండి.

శోభ: ఊఁ! (అని నిట్టూర్పు విడుస్తూ లేస్తాడు.)

★

# గోడవిఱిగిన నూయి

ఆ వూరికి ఎన్నాళ్లుగానో రోడ్డు రోడ్డు అని పలవరించగా తుదకు మొన్న మొన్నను ఒక ఎన్నికల సందర్భంలో తాలూకా బోర్డువారు ఒక పక్కా రోడ్డు వేయించారు. ఆరోడ్డు పొడుగు అంతా కొలిస్తే ఒక మైలు. కాని రోడ్డుపడిన తరువాత ఊళ్లో ప్రజలు పంచవర్ష ప్రణాళిక క్రింద వేసికొన్న రోడ్లు ఇరవైనాలుగటు. ఫోటోలుకూడా చూపించారు, ఆమట్టిపోసి వాళ్లవి, ఆ పోయించేవాళ్లవి అవీ ఇవీని. మరీన్ని నూతనంగా వెలిసిన పంచాయితీ బోర్డువారు ఊరియొక్క కోనేటిని పరిశుభ్రంగా ఉంపించుము, వీధులను విశాలము చేసి తుడిపించుము "మంచిగ్రామం అది" అని అనిపిస్తూ వున్నారు. ఊరు కలకల లాడుతూ జనమయమై పొలంమయమై ఎప్పుడూ కనబడుతూ వుంటుంది. ఆ ప్రజలది అంతా కాయకష్టమేనని నా వూహా! వంకాయలు కాపిస్తారు; దుంపతీగ పాకిస్తారు. చెఱుకుతోటలు వేస్తారు. మరీ వరిసాగు విరివిగా కానిస్తారు. ఊరు చుట్టూ కొండలు, ఊరికి దరిదాపులో పంట చెరువులు, అక్కడక్కడ కేళనాళీమామిడులు, కొబ్బరిచెట్లు అరటిచెట్లు చెప్పక చెబుతూవుంటాయి ఊరు అందమైన ఊరని. అయితే నా ప్రశ్న దక్కగా పస్తారోడ్డు విడిచిపెట్టి ఒక్కొక్కప్పుడు ప్రజ అడ్డంగా వడతారు. ఏమనికి?"

నేను మొదట్లో రోడ్డుమ్మట ఆ ఊరినుంచి మరోవూరికి నడవాలని బయలుదేరాను గాని, ఒకతోటనుంచి ఒక బరువు కావడితో ఒక చాకలి రోడ్డుదిగి నడవడం చూచాను. మరీ వానివెనకాలే పగడాల పేరు మెళ్లోను, చేతుల్ని వెండి మురుగులు తళతళలాడుతూంటే నెత్తిమీద ఒక వంకాయలతట్ట తట్టమీద తక్కెడ పెట్టుకుని ఒక అమ్మకూడా రోడ్డుదిగడం చూచాను. మరీన్ని వారి కెదురుగా పాలకాల బాల బాలికలు పుస్తకాలతోను పలకలతోను రావడం చూశాను. అలాకూడా ఒక దారి ఏర్పడింది కాబోలు అని అనుకున్నాను. నేనున్నూ రోడ్డుదిగి ఆ అడ్డుదారి ఏమిటో తెలుసుకుందామని పయనమయ్యాను.

కొంతదూరం వచ్చేసరికి, అవతలగా గంటు మాగు మళ్లు, కోసి వేసినవి, ఇంకా వరిమోళ్లు కాలిక్రింద పడి నలుగుతూ వున్నవి, దాటుకుంటూ పోయేసరికి, దారి కటూ అటూ చిల్లబడి, ఎడిగ పసుపు పచ్చగా వూగుచిన జనం కానవచ్చింది. మరీన్ని సూర్యుడు ఆస్తమయారుణ బింబమై, నీరెండను ఈ జనంపూతకు ఎర్రగా కొసుబంగారపు పూత పెట్టే మాదిరిగా కానవచ్చాడు. దూరాన్నే కొండలు ఎఱ్ఱబారి రంగితో చేయబడ్డ కలశే కేసులై కొలనులున్న కాపరచ సాగాయి. అక్కడో పిట్ట అక్కడో పిట్ట, పేరులు నాకు బోధపడలేదు గాని, కిచ కిచ మంటూ తమ కులాయాలు చేరుకుంటూ వున్నాయి. ఆ చేలో ఆ దారి నే నడిచే జనం చెప్పేవి నే ఊసులుకూడా ఏదో బాధ అని అనిపించలేదు. అదో ఘోషలా వినవచ్చేది. మళ్లీ దూరమయ్యేది. అంతే ఇటూ అటూ ఆ అడ్డ దారిని జనంయొక్క సందడి ఆజనం యొక్క మార్పుదలనుబట్టి మారుతూ ఏమి భాషో అని అనుకునేటంత అస్పష్టంగా వుంటోంది. నడిచే జనం తెలిసినా వారనుకొనే మాటలు తెలిసేవి కావు.

## కవికొండల వెంకటరావు

ఆ జనంచేను ప్రక్కనే ఒకపెద్ద కుప్ప నూర్పబడుతూ వుంది. ఆ కుప్ప నూర్పుకు సందడికూడా ఉత్సాహంగానే వుంది కాని అదికూడా అస్పష్టమే! దూరానికి గడ్డి, ధాన్యం, గొడ్లు, పాలేళ్లు, యజమాని, కళ్లం, అన్నీ గోచరింపులే! అయినా వాళ్లు కేకేసే కేకలు గాని అదలింపులు గాని ఇవి అనిమనం వేర్పాటుగా వినుగ్గొంచలేము.

వీధి ఎలావున్నా ఇదంతా చూడగా చూడగా ఒకటేమాత్రం సత్యం అని అనిపించింది. మనిషి గాబించే మార్పుల వల్లనే ప్రకృతి నానాటికీ అందగించగలదని, ఈ కలిగించేమార్పులుఅన్నీ మానవుడు తనభోజనానికనే చేసుకుంటాడని, ఏనాటోటి గాకో ఊరికే మార్చూవుంటూ ఆనందిస్తాడని అని పించింది.

అలా అనుకొంటూ వుండగా ఒక విచిత్ర సంఘటన తటస్థించింది. అదియిది. నేనన్న జనపచేలో తూర్పువైపుగా ఒక మామిడి చెట్టు, పూతబలిసి అక్కడక్కడ గోళీకాయలంతలేసి కాయలు కాసింది కనిపించింది. "అప్పుడే మామిడిచెట్లు కాయలు కాసేనే" అని అనుకున్నాను గట్టిగా. నే ననుకొన్నది విన్నాడో ఏమో నా వెనక నుంచి నడచివచ్చే ఒక ఎమ్మెలాంటి గొంగూరగంప మోసికొంటూ అన్నది "మరి కొరుకొండ తీర్థానికి కోడిగుడ్లు అంత అవుద్దండీ" అని. నే వెనక్కు తిరిగి ఆ మెను దారియిస్తూ, ఆ కాలంలో మాసం మాఘ మాసముగా గుర్తిస్తూ మరి నెల్లాళ్లకే కోరు కొండతీర్థము అని తెలుసుకొన్నవాణ్ణై మట్టూ పరకాయించాను. మరి ఆ వొక్క మామిడి చెట్టేగాని ఆ పొలాల్లో వేరే చెట్లు లేవు. అదిగాక రోడ్డు లేనప్పుడు, తిన్నగా కోరుకొండ కొండను చూచుకుంటూ నా గ్రామం నుండి కోరుకొండ గ్రామంకు నేను నడచి వెళ్లినదారి అదీ ఏమైనవా అని తలకించాను. ఆరోజుల్లో ఆదారిని 'నరింవారి' అని అనే వాళ్లు. మరీన్ని సరిగా కొన్ని మామిడి చెట్ల సందునుండి వుండేది ఆదారి. ఆ మామిడి చెట్లుకూడా నుది మామిడిచెట్లుగావుండి

## ★ గోడవిఱిగిన నూయి ★

బదనిక బలిసివుండేవి. ఇప్పుడవన్నీ కొట్టి వేయబడ్డాయి కాబోలు అని కొంచెం విచారంతో పక్కకు తొలిగాను.

ఆ పక్కకు తొలగడంతో జనప చేలోవున్న మామిడిచెట్టు దిక్కుగా చేలోకి అడుగువేశాను. అడుగువేసిన తక్షణం అడ్డదారిని వదిలివేశాను. పువ్వులు, ఆ మొక్కలివి, చిఱుగాలికి అల్లల్లాడుతూ నా మీద కొరగినట్టయినాయి. నేనున్నూ ఏదారినీ నడవకున్నా ఏదో దారినే ఉన్నట్టు మైమఱచిపోయాను. ఆలా ఆలా ఆ కనిపించిన మామిడిచెట్టువంక కింకొం అడుగులు వేశాను. మామిడిచెట్టును తిలకించాను. మఱీన్నీ దాని కింద ఒక నూయికూడా ఉంది. అది అసలు కట్టునుయ్యే గాని నేడు పాడు వెట్టబడి, ఎంచేతో, గోడ కొంతభాగం పడిపోయి నేలమట్టంగా నిలిచివుంది. నీరుమాత్రం ఊబుకుతూవుంది. ఆ నీరు వుండడం చేత పైని మామిడిచెట్టు, ఆ మామిడిచెట్టు ఆకులు పువ్వులు కాయలు, గాలికి తొలగినప్పుడల్లా నింగీ ప్రతిఫలించేని.

నేనున్నూ ఆ నూతిని మిగిలివున్న గోడను ఒకప్పుడున అనుకొంటూ, పైనిగల చెట్టువంకకు మంచేలో చెట్టునుండి ఒక ఎంటి నూతిలోకి ప్రేలాడివుంది. "ఎందుకో ఆ వంటి?" అని నేను అనుకునేలో యజమాని ఆ నూతివద్దకు వచ్చాడు. యజమాని నేను అన్యోన్యం ఆ వఱకు ఎఱిగివున్నవాళ్ళమే! "మీదా ఈ నూయి?" అన్నాను. "అవునండీ! తమరిలా వచ్చారేం? దారితప్పలేదుకదా? చేనడ్డము డ్డారు లేండి!" అన్నాడు. మఱి నే జవాబు చెప్పకుండానే ఇంకో అన్నాడు అతగాడు "ఆ నూర్పవరి కుప్ప, ఈ కాసిన మామిడిచెట్టు ఈ పంపు ఇవన్నీ మావేను!" అన్నాడు.

"ఈ నూయి?" అని అడిగాను. "ఇది మాదేను." అన్నాడు. "అయితే నూయి చాలా పురాతనపునుయ్యిగా తోస్తూవుందే! గోడకూడా కొంత కొంత పడిపోయి ప్రజలకు అనర్థదాయకంగావుంది!" అన్నాను.

"ప్రజల్ని, నా చేనడ్డమడి, ఎవరైన్నా ఈలా రమ్మన్నానా?" అన్నాడు మహాగ్రుడై. "రమ్మనమన లేదు గాని, వస్తారు నాలాగు" అని అన్నాను చిరునవ్వు నవ్వుతూ. "అందుకే ఒక గట్టివెంటి చెట్టునుండి ప్రేలాడ గట్టించింది. ఎవరైనా ఈ నూతిలో పడిపోతే దానమ్మకొని పైకెక్కి పోవడానికి" అని అన్నాడు కోపమంతా దిగ్గొట్టుకున్నవాడై ఆ యజమాని.

"ఒక వేళ ఎవరైనా మామిడికాయల కోసం చెట్టెక్కి కొమ్మలెను ఆ వెంటికూడా తెగ నూతిపడితే?" అని నేను ప్రశ్నించాను. "ఆ అపాయం ఎప్పుడూ వుంది. నూతి గోడ పడిపోయినంతమాత్రాన్నే అది రాదు. ఇంతకూ ఈ నూయి దానంతటది కప్పడేదాకో, ఈ మామిడి చెట్టుకు అవసరమేమోనని ఇలా వదిలేశాను. మామిడిచెట్టే, నూతిగోడ పొడి పొడి అయ్యేలోగా, పుల్ల విరిగిపోతే తగువే లేదు." అన్నాడు. "అవును లేండి. ఏవీ శాశ్వతం కావు. కాని ఉన్నంతకాలం నూయి నూతి ప్రక్కన చెట్టు పుణ్యెయ్యడం మంచిదే." అని నేనని యజమానినుండి సెలవుతీసికొన్నాను.

మఱి నాలుగడుగులు ఆ చేలోనే అడ్డంగా తూర్పుకు వేశాను. రోడ్డు తగిలింది. అడ్డదారిని చేరుకొన్న జనంకూడా ఆ రోడ్డునే నడుస్తున్నారు. "అయ్యగారూ! తమరు రావడం ఆలస్యమైందేమండి?" అని నన్ను వారు అడిగారు. నేనున్నూ జరిగిందంతా చెప్పాను.

"అసలా కుప్ప నూర్పాక ఈ జనం కోశాక మరెవ్వరూ చుట్టుప్రక్కల వుండరు. ఈ పొద్దుకాబట్టి మీకు యజమానిగారు కనిపించారు. ఆయనరారు ఆయన పాలేళ్ళురారు ఇలా! దాగే పోయే వాళ్లు ఒక్కొక్క ఇటుకే ఆ నూతిగోడను ఊడతీసి ఆ మామిడికాయలు కొట్టుకుంటూ వుంటారు. ఇదీ దాని వృత్తాంతం." అని చెప్పారు.

"గడ్డివెంటి?" అన్నాను. గడ్డివెంటి అన్నదికూడా ప్రజలు పన్నిన పన్నాగమే. పాలేళ్ళంతాపోగై ఒక గడ్డి వంటి మొఱి ప్రేలాడగట్టారు ఆ మామిడిచెట్టుని. ఈపొద్దు కుప్పనూర్పుడైపోతే రేపు అగ్గిపుల్లతో దాన్ని అంటించి పారేస్తారు." అన్నారు.

"నీళ్లలాగే వుంటాయి కాయలలాగే వుంటాయి?" అన్నాను. "నీళ్లూ కాయలూ అన్నమాటేం? నూతిలోకి చూచేవాళ్ళ నీడలుకూడా ఆలాగే వుంటాయి. అవి ఎన్నటికీ తఱుగుడవు." అన్నారు.

మేమున్నూ రోడ్డుచివర ఆవలియూరు చేరుకున్నాము. ★

# వనితాలోకం

## బహ్వార్థసాధక భోజనము

బెంగుళూరులోని భారతీయ శాస్త్ర పరిషత్తువారు బహ్వార్థ సాధక మైన, సమధాతువైన ఆహారాన్ని, చౌకగా సమకూర్చటానికై పరిశోధనలు చేసినట్లుగా పత్రికలలో ప్రకటింపబడ్డది మూడువంతులు వేరుసెనగపిండి, ఒక వంతు తెలకపిండి, ఒకవంతు సోయా చిక్కుడు పిండి కలిపి తయారుచేసిన ఆహారానికి బహ్వార్థ భోజన మని పేరుపెట్టారు దీనివలన బీదవారికి కూడా చౌకగా పుష్టికరమైన ఆహారము లభ్యమవుతుంది

అమెరికను రిపోర్టరు పత్రికలో ఇటు వంటి ఆహారాన్ని గూర్చి కొన్ని వివరాలు ప్రకటింపబడ్డాయి 1946 లో లాస్ ఏంజలిస్ (*Los Angeles*)లో శాస్త్రీయమైన చౌకభోజనములను సిద్ధము చేయటానికి ఒక సంస్థ నెలకొల్పబడ్డది క్లిఫర్డు క్లింటన్ అనే ఒక హోటలు యజమాని ప్రోత్సాహముతో సాగింపబడిన పరిశోధనల ఫలితముగా ఈ సంస్థ ఏర్పడ్డది.

ఆహారము చౌకగా ఉండటమే కాక, పుష్టికరమైనదిగా ఉండవలెననీ, నిలువ చేయటానికి అనువైనదిగాను, ఎగుమతి దిగుమతులకు వీలైనదిగాను ఉండవలెనని క్లింటను ఆశయము ఇన్ని ఆశయములతో కూడిన ఆహారాన్ని డాక్టరు హెన్రీ బొర్స్నాక్ కనిపెట్టాడు గానుగ ఆడినతరువాత మిగిలిన సోయాబీను పిండిని 90 పాళ్లు ముఖ్య పదార్థముగా తీసుకొని, దానిలో ఖనిజ పదార్థాలు విటమినులు కలిపి, ఈ బహ్వార్థ సాధకభోజనము సిద్ధము చేయబడ్డది ఒక మనిషికి కావలిసిన ఇటువంటి ఆహారము ఖరీదు 3 సెంట్లు లేక $2\frac{1}{4}$ అణాలు ఈ గమును నీటితో ఉడికించిగాని, గోధుమ

[illegible]

పిండితో కలిపి రొట్టెగాచేసిగాని, ఇతర ఆహారపదార్థాలతో కలిపిగాని సులువుగా ఉపయోగించుకొనవచ్చును 1946 లో యూరపు ఏషియా దేశాలలో క్షామపరిస్థితులు ఏర్పడినప్పుడు ఈ బహ్వర్థ సాధకాహారపు పొట్లాలను లక్షలాదిగా అమెరికా నుండి పంపించారు కాలిఫోర్నియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో ఈ పరిశోధన జరిగింది, ఇంకా పరిశోధన సాగుతూనే ఉన్నది బెంగుళూరు ఇన్‌స్టిట్యూట్‌లో అటువంటి పద్ధతులపైననే పరిశోధన జరిగింది సోయాబీనుకు బదులుగా మనదేశములో చౌకగా లభించే వేరుసెనగ తెలక పిండ్లను ప్రధానంగా కలిపి సిద్ధముచేశారు

మనకు ఆహారముయొక్క అవసరము ఏమిటి? మన దేహానికి ఎటువంటి ఆహారము ఉపయోగకరము? బహ్వార్థసాధకము, సమధాతువైన ఆహారము అంటే ఏమిటి? ఇవి గృహిణులు ముఖ్యముగా తెలిసికొనదగిన విషయాలు

జీవితములో మనము గడపే ప్రతి నిముషానికీ దేహములో కొంత శక్తి వ్యయమవుతూ ఉంటుంది మన అవయవముల కదలికవల్ల శక్తి వ్యయమవుతుందని తెలుస్తునే ఉంటుంది, కాని అవయవములను కదలించకుండా నిశ్చలముగా ఉంచినప్పటికీ శక్తి వ్యయమవుతూనే ఉంటుందని మనము గ్రహించాలి. రక్తప్రసారము, ఊపిరితిత్తుల కార్యము, ఆహారము జీర్ణమగుట—వీటన్నిటికి శక్తి వ్యయమవుతూ ఉంటుంది. మానవ దేహము ఒక యంత్రమువంటిది ఈ యంత్రము పనిచేయటానికి శక్తి - ఉష్ణము అవసరము మోటారుకారు నడవటానికి పెట్రోలు అవసరమయినట్లే, దేహము నడవటానికి శక్తినీయగల ఆహారము అవసరము

మనము జీవించటానికి ఆహారము అవసరమని తేలింది కేవలము జీవించటానికి మాత్రమే కాకుండా, దేహాన్ని ఆరోగ్యవంతముగా ఉపయోకరముగా ఉంచే ఆహారము అవసరము మంచి ఆహారమంటే రుచికరమైనది ఆకలిని తీర్చకలిగినదిమాత్రమే

( 30వ పేజీ చూడండి)



ఉదయసంధ్యా కాంతిలో
ఉర్వీముత్తి ఏపదిని.



# బహ్వర్థసాధక భోజనము



కాదు—శారీరకాభివృద్ధిని కలిగించి, దేహమును మనస్సును వాటి ధర్మాలను సక్రమముగా నిర్వర్తింప చేయకలిగినదిగా ఉండాలి.

ఆహారముయొక్క ఉద్దేశ్యములు మూడు అని మనము భావింపవచ్చు మొదటి ఉద్దేశ్యము శరీరధారణకు కావలసిన వేడిని, శక్తిని సమకూర్చగల పదార్థాలు కలిగి ఉండాలన్నది. శరీరము అభివృద్ధి చెందటానికి కావలసిన పదార్థాలను సమకూర్చటము రెండవ ఉద్దేశ్యము. ఇది శిశువు జన్మించినది మొదలు 20 సంవత్సరముల వయస్సు వరకు ముఖ్యముగా అవసరము. శరీరములో నశించిపోయే లేక శిథిలించిపోయే కణముల లోటును పూర్తిచేయుట కూడా ఆహారము యొక్క ఉద్దేశ్యమే. ఈ మూటితోపాటు, పైన వివరింపబడిన కార్యక్రమాలను సక్రమముగా జరిగేటట్టు చేయగల పదార్థాలు కూడా ఆహారములో ఉండటము అవసరము.

పై ఉద్దేశ్యాలకు అనుగుణముగా కావలసిన పదార్థాలు ఏవి? శరీరాన్ని పోషించటానికి ప్రోటీనులు (మాంసకృత్తులు); శక్తిని ఉష్ణమును సమకూర్చటానికి పనికివచ్చే క్రొవ్వులు (*Fats*) లేక నూనెలు, కార్బోహైడ్రేట్లు (పిండి పదార్థాలు చక్కెర పదార్థాలు) శరీరములోని ధర్మాలకు తోడ్పడే ఖనిజపదార్థాలు, విటమినులు అని నిర్ణయింపబడ్డది.

మనము తినే ఆహారములో పైన వ్రాసిన వివిధ పదార్థాలు సరియైన పరిమాణాలలో ఉంటేనే సమధాతువైన ఆహారమనిపించుకొంటుంది. కావలసిన పదార్థాలన్నీ ప్రకృతిలో, మనకు లభించే ఏ ఒక్క వస్తువులోనూ పూర్తిగా ఉండటము అసంభవము. ఒక్కొక్క వస్తువులో ప్రోటీనులుగాని, పిండిపదార్థాలుగాని లవణములుగాని ఎక్కువగా ఉంటాయి. కాబట్టి పరిపూర్ణమైన భోజనము కావలెనంటే వివిధ పదార్థాలను ఉపయోగించుకొనవలసి ఉంటుంది. ఏ భాగము లోపించినా ఏదో ఒక కొరత ఏర్పడుతూనే ఉంటుంది.

ఆహారపు విలువను శాస్త్రజ్ఞులు కేలరీల పద్ధతిలో ఏర్పాటుచేశారు. సాధారణముగా వివిధములైన ఆహారాలు ఎన్నెన్ని కేలరీల శక్తిని సమకూర్చగలవో దానిని బట్టి ఆహారము యొక్క విలువ నిర్ణయింపబడుతుంది ప్రోటీనులు క్రొవ్వు పదార్థాలు పిండి చక్కెర పదార్థాలు ఎన్నిపాళ్లుగా ఉపయోగిస్తే శరీరానికి అవసరమయిన శక్తి ఉష్ణము, శరీరపోషణకు కావలసిన పదార్థాలు సమకూరుతాయో శాస్త్రజ్ఞులు తెలిపారు

సాధారణముగా మనుష్యులకు 4½ ఔన్సుల ప్రోటీనులు, 4½ ఔన్సుల క్రొవ్వు పదార్థాలు, 13 ఔన్సుల పిండి చక్కెర పదార్థాలు అంటే మొత్తము 22 ఔన్సులు అవసరము ప్రతిదినము ఉంటుంది. ఈ ఆహారము 3200 కేలరీల శక్తిని సమకూరుస్తుంది. పై పదార్థాలతోపాటు తగుమాత్రముగా లవణములు విటమినులు కూడా ఆహారములో ఉండటము అవసరము. ఈ ప్రమాణము దేశమునుబట్టి, వ్యక్తులనుబట్టి పరిస్థితులనుబట్టి భేదిస్తుంది.

మానవదేహములో నీరు అధికముగా ఉంటుంది దీని తరువాత పరిగణింప తగినవి ప్రోటీనులు. ఇవి దేహములో రమారమి అరవవంతు ఉంటాయి. వీటిలోనే రక్తము శరీరకణాలు తయారు అవుతాయి. ఇవి దేహనిర్మాణానికి అవసరమయినవి. దేహములోని వివిధ భాగాలలో జరిగే కార్యనిర్వహణకు దోహదమిస్తాయి. ఆహారములో వీటి భాగము ఎక్కువగా ఉండవలసి ఉంటుంది. ఇవి మాంసము, గ్రుడ్లు, చేపలు, పాలు, పప్పుపదార్థాలలో ఎక్కువగా ఉంటాయి. ధాన్యముల పొట్టులో పొరల లోనూ ఉంటాయి. మన నిత్యభోజనములో పైన వివరింపబడిన ప్రోటీను పదార్థాలు ఒకటికంటె ఎక్కువ రకాలు ఉండాలి.

శరీరానికి శక్తిని సమకూర్చగల క్రొవ్వు పదార్థాలు లేక నూనెలు, చాలా అవసరమైనవి. నెయ్యి కూడా వీటిలోనే చేరుతుంది.

ఎముకలు పండ్లు పట్టిగడటానికి, మాంసకణాలు వృద్ధిపొందటానికి, పరిశుభ్రమయిన రక్తము ఏర్పడటానికి, గ్రాండులు (*Glands*) సక్రమముగా పనిచేయటానికి, లవణాలు (ఖనిజ పదార్థాలు) చాలా అవసరము. కాల్షియము, సోడియము, పొటాసియము, ఇనుము ఫాస్ఫరస్, గంధకము—వీటితో కూడిన లవణాలు ఆహారములోని ముఖ్య భాగాలుగా ఉండాలి. పాలు, దుంపలు కూరలు కాయలు, ధాన్యములు వీటన్నిటిలో లవణాలు ఉంటాయి ఇవి ఆహారములో తప్పక చేర్చవలసి ఉంటుంది.

పిండిపదార్థాలు మనము తినే ధాన్యాలలో పుష్కలముగా ఉంటాయి. మన ఆహారములో అన్నము (బియ్యము, గోధుమలు, జొన్నలు) ముఖ్య భాగము కదా! చక్కెర పదార్థాలు ఒకవిధముగా ఈ భాగములోనే చేరాయి. ఈ రెండు రకముల పదార్థాలు శరీరానికి శక్తి-ఉష్ణము నివ్వటములో సహకరిస్తాయి.

విటమినులనే ఒక ప్రత్యేక జాతి ఆధునిక కాలములో అనగా 20 వ శతాబ్దారంభములో గుర్తించబడి ఆహారములో ఈ విటమినులకు ప్రాముఖ్యము ఇవ్వబడ్డది.

విటమినులకు వర్ణక్రమ విధానములో *A, $B_1$, $B_2$, $B_{12}$, C, D, E, K, P,* ఈ విధముగా నామకరణము చేయబడ్డది. వీటినుంచి శరీరానికి శక్తిలేక ఉష్ణము లభించదు. కాని ఇవి లేనట్లయితే శరీరయంత్రములోని కార్యక్రమాలకే భంగము కలుగుతుంది. అనేక వ్యాధులు ఉద్భవిస్తాయి. ఒక్కొక్క విటమిను యొక్క కార్యము ఒక్కొక్క ప్రత్యేకత కలిగి ఉంటుంది. విటమినులు వేర్వేరుగాగాని కొన్నికొన్ని ఉమ్మడిగాగాని ధాన్యపు పొట్టులో, పాలలో, గ్రుడ్లు చేపలు, మాంసము, పప్పుధాన్యాలు, పండ్లు కూరలు, కాయలు వీటిలో ఉంటాయి. ఈ వివరాలకొరకు ఆరోగ్యశాస్త్రాలలోను ఆహారశాస్త్రాలలోను చూడవచ్చును.

బహ్వర్థసాధకమైన ఆహారము పైన వివరింపబడిన వివిధ భాగములను కలిగి, తగిన కేలరీలవిలువ కలిగినదిగా ఉండవలెను. అప్పుడే దానికి సార్థకత్వము ఉంటుంది. దీనికితోడు చౌకగా దొరికినట్లయితే బీదజనులకు కూడా ఉపయోగకారిగా ఉంటుంది.

బెంగుళూరు ఇన్స్టిట్యూటువారు సిద్ధము చేసిన బహ్వర్థసాధకమైన ఆహారములో ప్రోటీనులు, క్రొవ్వుపదార్థాలు, విటమినులు మొదలైనవన్నీ కలిపి సిద్ధము చేస్తున్నారని ప్రకటింపబడ్డది. ఇది ప్రజల క్షుద్బాధను తీర్చి ఆరోగ్య భాగమును ఇనుమడింపజేయగలదని ఆశిద్దాము.



వనితాలోకం:

# చిన్నిపాపలు క్రమబద్ధతను హర్షిస్తారు

చిన్నిపాపలు అల్లరిచేస్తూ ఉంటారని మన అభిప్రాయం. డబ్బాలో పోసిన పప్పులను, చేటలో ఎండవేసిన వడియాలను, పెట్టెలోని బట్టలను - ఒక టేమిటి - చేతి కందినవానిని వాళ్లు లాగి చిందరవందరగా పారవేస్తూ ఉంటారని తల్లులు చెప్తూ ఉంటారు. ఇది వాళ్ళ నైజగుణమని వారి దృఢవిశ్వాసం. ఈ నమ్మకం నిరాధార మైనదని మాంటిస్సోరి సతి గారు చెప్తున్నారు.

బిడ్డలు సహజంగా క్రమబద్ధతను హర్షిస్తారు. క్రమబద్ధతను వాంఛిస్తారు ఇంటిలో అనేకవస్తువులను వివిధస్థలములలో పిల్లలు చూస్తూ ఉంటారు. ఒకవస్తువు ఎప్పుడూ వాళ్లకు ఒకేచోట కన్పిస్తూ ఉంటుంది. గొడుగు ఎప్పుడూ తలుపువెనకాల కన్పిస్తూ ఉంటుంది. కొళ్లు తుడుచుకే గోనెసి ద్వారం ఎదట అగపడుతూ ఉంటుంది. ఏరోజైనా గొడుగు తలుపు వెనకాల, గోనెసి ద్వారం ఎదట కనిపించక అవి వేరొకచోట కనిపిస్తే పిల్లలు విస్తుపోతారు. వాళ్ళ శాంతియుత మైన మనోరాజ్యంలో కొంత క్షోభ కలుగుతుంది.

ఈ సిద్ధాంతమును సమర్థించుటకు మాంటిస్సోరి సతిగారు పలుసంఘటనలు ఏకరువు పెట్టినారు. వానిలో రెండుమూడు ఇక్కడ వివరిస్తా.

ఒకనాడు ఒకఆమె బంధువుల ఇంటికి పోయి చేతిసంచీని గదిలోని టేబిలుపై పెట్టింది. ఆ గదిలో ఆరునెలలవయస్సు గల పాప పాకుతూ ఉంది. టేబిలుమీద చేతిసంచీని చూచి ఆపాప ఏడ్పుట మొదలెట్టింది. సంచీకోసం ఏడుస్తుందేమోనని వచ్చినఅతిథి పాపను సంతృప్తిపరచడానికి ఆ సంచీని టేబిలుపైనుండితీసి బిడ్డకు అందించింది. పాప ఇంకా ఎక్కువ బిగ్గరగా ఏడ్పుట మొదలెట్టింది. ఏడుపు విని లోనుండి తల్లి పరుగెత్తుకొని వచ్చింది. తల్లికి శిశువు మనస్తత్వము పరిపూర్ణముగా తెలుసు. ఆమె వెంటనే టేబిలుమీదఉన్న సంచీని తీసి వేరొకగదిలోనికి గొనిపోయినది. పాప తక్షణమే ఏడుపుమాని ఊరడిల్లింది. పిల్ల ఏడ్పుటకు హేతువు ఏమిటంటే ఆ ఇంటివారు ఎన్నడూ చేతిసంచీని గాని, గొడుగును గాని టేబిలుమీద వదలి ఎరుగరు. చేతిసంచీలను ప్రక్కగదిలోని చిలకకొయ్యకు తగిలింతురు. పసిపాప టేబిలుపై యీవస్తువులను ఎన్నడూ చూచి యుండలేదు. అందుచే తొలిసారి టేబిలుమీద చేతిసంచీని చూడగానే ఏడ్వసాగింది.

ఇంకొక ఉదాహరణ. నేపిల్సునగరంలో 'నీరోగుహాలని' వింత గుహ లున్నవి. అవి చూచుటకు వివిధదేశములనుండి అనేకులు నేపిల్సు వెళ్తూఉంటారు. ఒక శీతకాలమున మాంటిస్సోరి సతి అక్కడకు వెళ్లింది. ఆమెతో కూడ అనేకమంది తల్లులున్నారు. ఒకతల్లి వెనుక $1\frac{1}{2}$ సంవత్సరములు వయస్సుగల పిల్ల వస్తూంది. శీతకాలముగుటచే యాత్రికులందరూ పొడుగాటి ఓవరుకోటులు తొడుక్కొన్నారు. ఓవరుకోటు బరువైనదగుటచే పిల్ల దానిని మోయలేక నడకలో వెనుకబడుచున్నదని తల్లి ఆ పిల్ల వీపుమీదనున్న ఓవరుకోటు తీసివేసెను. ఎండ బాగుగా కాస్తూఉంది - పిల్లకు ఓవరుకోటు ఆవశ్యకత లేదు. అయినను ఓవరుకోటు తీసి

గుడిమెళ్ల
బాలా త్రిపురసుందరి

వేయగనే ఆమె ఏడ్పుట ప్రారంభించినది. ఓవరుకోటులేక ఆమె ఎప్పుడూ బయట నడువలేదు. ఓవరుకోటు తొడుగుకొనక నడచుట క్రమవిరుద్ధమని ఆ పసిపాప అభిప్రాయము. ఆ పిల్ల ఎందుకు ఏడ్పుచున్నదో తోటివారికి తెలియలేదు. మాంటిస్సోరి సతి వెంటనే పాపకు ఓవరుకోటు తొడుగుమని సలహా నిచ్చినది. ఓవరుకోటు తొడుగగా పిల్ల ఊరడిల్లినది. పసివారల చిరుత హృదయములు నాజూకుగా అతి సున్నితముగా ఉంటాయి. ఎట్టి స్వల్పమైన మార్పునైనను అవి ఇట్టే గుర్తిస్తాయి. ఇంగితజ్ఞులు చిరుతహృదయాల నిర్మలభావాలను సహర్షంగా ఆదరిస్తారు.

మూడవ ఉదాహరణము. పిల్లల ఆటపాటలందు సైతము క్రమబద్ధత ద్యోతకమగునని దీనివలన తెలుస్తుంది. రెండు మూడు సంవత్సరముల పిల్లలు కొందరు దాగుడుమూత లాడుకొంటున్నారు. వారిలో ఒకడు అందరు చూస్తూఉండగానే బల్లక్రింద దాగెను. కొంతసేపటికి మిగిలిన పిల్లలు దాగొనినవానిని వెతుకుటకు గది విడిచి బయటకుపోయి తిరిగివచ్చి బల్లపైనున్న గుడ్డను ఒత్తిగించి బల్లక్రింద దాగొనినవానిని చూచి అపరిమితాట్టహాసము చేసిరి. కొందరు తప్పట్లు తరచిరి. అందరూ సంతోషించిరి. తిరిగి మొదటివాడు దాగుకొందునని పోయి నలుమూలలా తిరిగి బల్లక్రింద దూరాడు. వీరి ఆటను ఒక ఇల్లాలు అబ్బురంతో చూసింది. కొంతసేపైన తరువాత పిల్లలు ఆమెవద్దకు వచ్చి 'మీరుకూడా మాతో ఆడెదరా?' అని అడిగారు. వారితో ఆడుటకు ఆమె సమ్మతించింది. అప్పుడు వారు ఆమెను దాగుకొనమన్నారు. ఆమె పోయి వేరొక గదిలో దాగుకొంది. పిల్లలు ఆమెను వెదుకునట్లు గది అంతా నాలుగుసార్లు తిరిగి బల్లక్రింద చూచిరి ఆమె అచ్చటలేదు. వెంటనే వారు నిరాశ చెందిరి. కొంతసేపటికి ప్రక్కగదిలోనుండి ఆమె వచ్చింది. అప్పుడు పిల్లలు ఆమెతో 'మీరు మాతో ఆడెదనంటిరిగా? మరి ఆడరేం?' అని ప్రశ్నించారు. దీనినిబట్టి మనకు స్పష్టమైన దేమిటంటే పిల్లలు ఒకచోట చూచిన వస్తువు అచ్చటే ఉండవలెనని కోరుదురు. అనగా వస్తువులన్నియు క్రమపద్ధతిలో అలంకరింపబడి ఉండవలెనని వారి యూహ.

ఐతే, మాంటిస్సోరిసతి గారు మన ఊరు వస్తే కొందరు తల్లులు ఈప్రశ్న వేస్తారు. "పిల్లలు క్రమబద్ధతను హర్షిస్తారంటారు మీరు. మా ఇంటికివచ్చి చూడండి మా పిల్లలెంత హంగామా చేస్తారో అహర్నిశాలూ?" అంటారు. దీనికి సమాధాన మేమిటంటే - అట్టి ఇళ్ళల్లో తల్లికి గాని తండ్రికి గాని క్రమబద్ధయందు ఎక్కువ గౌరవం ఉండిఉండదు. సాధారణంగా అట్టి ఇళ్ళల్లో వస్తువులన్ని చిందరవందరగా పడిఉంటాయి. ఈరోజున గొడుగు గోడమూల ఉంటే రేపు అది వంటింట్లో పప్పు డబ్బా వెనక ఉంటుంది. అట్టి ఇండ్లలోని పిల్లలు తప్పక అల్లరిచేసి వస్తువులనన్నిటినీ చిందరవందరగా విసరివేస్తూ ఉంటారు. దీనికి కారణము ఏమిటంటే శిశువులకు క్రమబద్ధతయందు ఎంత మక్కువో అనుకరణయందు కూడ అంతే మక్కువ. పెద్దలు ఒక వస్తువును ఒకరోజున ఒకచోట రెండవరోజున రెండవచోటఉంచితే వారిపిల్లలు ఒక వస్తువును ఒకక్షణంలో ఒకచోటికి రెండవ క్షణంలో రెండవచోటికి విసిరివేస్తూ ఉంటారు. దీనినిమనం అల్లరి అంటాం. ★

# కిటుకు

ఓగేటి శివరామకృష్ణ

ఏమిటేమిటో తీయగా ఊహించుకొన్న కమల - శోభనపు పెళ్లికూతురయి— గదిలో అడుగిడబోతున్నది.

ఆ సమయంలో ఆమె అత్త, రాజేశ్వరి పనిగట్టుకు—ఆమెను దొడ్లోకి పిలుచుకు పోయింది.

"ఏమిటి అత్తయ్యా" — అంటూ వినయంగా కమల అత్తనుసరించింది.

వాళ్లు దొడ్లోకి వచ్చారు.

"ఏం లేదమ్మా. నువ్వు తెలివయినదానివి. భర్త నేవిధంగా చూచుకోవాలో నీకు తెలుసు ననుకుంటా. అయినా వాడి తల్లిగా నువ్వు నా కోడలువు కనుక నయంగా నీకీ సంగతి చెప్పటానికి పిలిచానమ్మా..." అంది రాజేశ్వరి చెప్పబోయేది చెప్పకుండానే.

"ఏమిటత్తయ్యా - అది"—అంది తిరిగి కమల...

"అబ్బాయికి కోపం యెక్కువమ్మా.... వాడికి ప్రతికూలంగా నువ్వేమాత్రం మసులుకు పోయినా—వొళ్లు తెలియని ఆవేశం వాడికి. ఆ ఆవేశంలో వాడు మంచి చెడ్డలు గుర్తించకుండా యిష్టం వచ్చినట్లుగా మసులుకు పోతాడు. తప్పేది తగినేదీ తెలియని పరిస్థితికి వాడప్పుడు వస్తాడు. అంగుకని... మిగిలిన మాటలు పూర్తి చేయకుండా రాజేశ్వరి నవ్వింది.

కమల అక్కడికక్కడే వణికిపోయింది. తానింతవరకూ ఒక విధంగా వూహించింది...తన వూహాలన్నీ కలలే నన్నమాట! వెల వెల బోతూ 'అయితే నన్నేం చేయమంటా రత్తయ్యా?' అంది అమాయకంగా, కమల.

"ఏం చేయటాని కేముందమ్మా! వాడి యిష్టాన్ననుసరించి నడుచుకుపోవటమే. అలా చేస్తే—వాడు నిన్ను నెత్తిమీద పెట్టుకొని పూజచేస్తాడు. మరి గొడవుండదు. తెలిసిందా"—అంది ఆవిడ తిరిగి నవ్వి!

"అలాగే అత్తయ్యా"—అంది యేలాగో కమల యేమిటో ఆలోచిస్తూ.

"మంచిదానవ్ తల్లీ"—అంటూ రాజేశ్వరి అంటూండగానే—

"అమ్మాయ్ ఇప్పటికే చాలా ప్రొద్దుపోయింది. పెండ్లికూతురెక్కడ"—అంటూ యెవరో దొడ్లోకి రాబోయారు.

అంతటితో వారు సంభాషణ చాలించి యింట్లోకి వచ్చారు.

* * * *

అది శోభనం గది—

శోభనపు పెళ్లికొడుకు సంజీవరావు—మంచంమీద జార్లగిలి పడుకొని - భార్య రాకకోసం కుతూహలంతో యెదురు చూస్తున్నాడు. నిమిషాలు గడుస్తున్నాయ్... కాని ఆమె రాక మాత్రం ఆలస్యం అవుతోంది...

పదిహేను నిమిషాలు గడిచాయ్...

భార్య గదిలోకి రావటంతోటే — పరిస్థితిని బట్టి చెంప పెట్టు సహితం పెట్టుదామనుకుంటున్నాడతను.

అటువంటి సమయంలో బయట గాజులు గలగలమన్నాయ్!

ముత్తయిదువులతో శోభనపు పెళ్ళికూతురు కమల గదిలో ప్రవేశించింది. ఆమె రాకతో సంజీవరావు కోపం సహితం—తాత్కాలికంగా మాయమయింది. సహృదయంతో భార్య నాహ్వానించుదామనుకొన్నాడతను.

ముత్తయిదువులు కమలను గుమ్మంముందు వదలి వెళ్ళిపోయారు. బయట గొళ్లెం వేయటం జరిగిపోయింది. కమల మాత్రం— గడియ వేయకుండా—ఓరగా భర్తవయిపు చూస్తూ అత్త చెప్పిన మాటలు గుర్తునకు రావటంవల్ల గుండెదడ మూలకంగా—అనుకూలంగా ప్రవర్తించవలసిన విధానంగురించి ఆలోచిస్తూ అక్కడే నిలబడిపోయింది.

పది నిమిషాలు తిరిగి గడిచాయ్.

మంచంమీద భార్య రాకకోసం యెదురు చూస్తున్న సంజీవరావు ముఖకవళికల్లో మార్పు వస్తున్నది; తీవ్రత అతడి వదనంలో ప్రవేశించబోతున్నది - అటువంటి పరిస్థితిలో—గది బయటనుంచి—

నవ్వులు విన్పించినాయ్!

"లోపల మాటలేం వినపడటం లేదే"—అంటున్నారెవ్వరో!

"మూగగానే మాట్లాడుకుంటున్నారు కాబోలు"—అంటున్నారు మరొకళ్లు.

"ఏడిశారు గాని నడవండి బయటకు"—అని యెవరో అనటంతో గుమ్మందగ్గర కాపున్నవాళ్లు మెల్లగా జారుకొన్నారు...

కమలకు ముచ్చెమటలు పోశాయ్.

ఆమెకు యేం చేయాలో యేమిటో తెలియని పరిస్థితి యిప్పుడేర్పడింది...ఇంకా ఆమె అక్కడే నిల్చుంది.

మరో కొద్దికాలం గడిచింది...

సంజీవరావులో కోపం యిప్పుడు పూర్తిగా ప్రవేశించింది. అతడిలో ఓర్పు నశించింది—

భార్యను లాలనగా ఆహ్వానించింది పోను సరిగదా—"నీకేం బుద్ధి లేదూ! అలా ఎంతసేపు నిలబడతావ్?" అని కసిరాడు.

కమల కొయ్యబారిపోయింది!

భర్త ఆవిధంగా అంటాడని ఆమె వూహించలేదు. అనురాగంతో ఆహ్వానించటానికి బదులు - ఆగ్రహంతో ఆహ్వానించటమా?

కమలనోట మాటలు నెమ్మదిగా వచ్చాయి .."వా..ళ్లు...వు..న్నా..రు... తలుపు"

"నీ నెత్తి" - కర్కశంగా అన్నాడు సంజీవరావు.

కమల హడలిపోయింది...

ఏం చేయాలో యేమిటో ఆమె కిప్పు డర్థం కావటం లేదు.

తిరిగి గదిబయట నవ్వులు....

"భేష్...మీ కేమాత్రం బుద్ధి లేదర్రా మళ్లా తయారయ్యారు. నడవండి. ఈ గది గూడా తాళం వేసిపారేస్తాను."

అవతల గదికి గూడా తాళం వేసినట్లు చప్పుడు విన్పించింది. "మరి రారు. బ్రతుకు జీవుడా" అనుకుంటూ జాలికలిగేటట్లు భర్త వయిపు చూసింది కమల. ఫలితం—గజగజ లాడిపోవటం.

సంజీవరావులో ఆగ్రహం మరింత అభివృద్ధి నొందింది.

అనురాగం పొందటానికి గదిలో ప్రవేశించిన తాను - ఆగ్రహం పొందబోతూన్నట్లున్నది. మరి జాగుచేయకూడదు ఈ విధంగా మనస్సులో నిశ్చయించుకొని, సిగ్గును దూరంగానెట్టి - తలుపు గడియ వేసుకొని మందగమనంతో మంచంవద్దకు పోయి నిల్చుంది కమల.

అంతవరకూ - కళ్లు తెరచుకొనివున్న సంజీవరావుకు కోపంతో బాటు దొంగనిద్ర కూడా ప్రవేశించింది.

అతను కళ్లు మూశాడు!

వెలవెలబోతూ, మృదువుగా "ఏమండీ" అని, అనురాగం వ్యక్తపరచటంకోసం - తలలో పూవు నొకదాన్ని తీసి, భర్త ముక్కు ముందు పెట్టబోయింది.

"భేష్" - అంటూ సంజీవరావు మంచం మీంచి లేచి కూర్చుని: "పొగరుబోతు పీనుగా" అన్నాడు గట్టిగా.

కమలకళ్లల్లో నీళ్లు నిల్చాయి. ఇంతవరకూ ఆమె యెవరిచేతా తిట్లు తినలేదు. అభిమానంవల్ల ముందువెనక లాలోచించకుండా "నేనేం పొగరుబోతు పీనుగను కాను" - అనేసి తర్వాత అలా అన్నందుకు మిక్కుటంగా బాధపడింది.

భర్తప్రవృత్తి, తెలుసుకొని వుండి కూడా, అత్త చెప్పిన సంగతులు గుర్తుంచుకొని కూడా, నోరుజారి, తానా విధంగా అనేసింది —

తర్వాత యేమనుకుంటే యేం ప్రయోజనం?

అంతమాత్రానికే సంజీవరావుకు కోపం పెల్లుబికివచ్చింది. అతగాడు తానెక్కడవున్నదీ మరచిపోయాడు. తాను వాంఛించే దేమిటో -అదేవిధంగా పొందాలో - కొద్దిమాత్రమయినా ఆలోచించకుండా "కానేం" అంటూ మంచంమీంచి లేచి, కమల చెంపమీద, అయిదు వ్రేళ్ళూ అంటేలాగ ఒక దెబ్బ వేశాడు!

కమల దవడ ఎఱ్ఱబడి వాచింది! ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ఆమె తీయగా వూహించుకొన్న వూహాలన్నీ యీవిధంగా అడ్డం తిరుగుతున్నాయి. కోపం సహితం ఆమెలో ప్రవేశించింది. కానీ - తానెవరో యిప్పుడు ఆమె గుర్తించుకొంది...తోడుగా అత్తమాట లిప్పుడామెకు జ్ఞాపకం వచ్చాయి...

కమల - భర్తఅనురాగం పొందటం - తన విధి అనుకొంది - అందువల్ల చెంప చెళ్లుమన్నా కిమ్మనలేదు...

పిచ్చిగా నవ్వుతూ, సంజీవరావు, ఆమెను అధీనం చేసుకున్నాడు.

భర్తనుగురించి దృఢఅభిప్రాయం కమలలో నాటుకుపోయింది: అతనికి కోపం యెక్కువ. అతగాడి మాటను జవదాటకూడదు - ఏమాత్రం అభ్యంతరం చెప్పకుండా - ఆయన యిష్టాన్ని గుర్తించి - దాని ప్రకారం నడుచుకుపోతూండాలి. అంతే. లేకుంటే దవడ వాపవుతూంటుంది!

* * *

కొంతకాలం గడిచింది...

కమల యిప్పుడు అత్తవారింటికి కాపురం చేయటానికి వచ్చింది...

అత్త రాజేశ్వరి, కమలను-కన్నకూతురిలా చూసుకుంటున్నది ... ఇంట్లోవాళ్లంతా, కమల నావిధంగానే చూస్తున్నారు.

కమల - అందరితోనూ యెంతో హితవుగా వుంటూ అందరి అభిమానం పొందుతూన్నది. కమల మామగారు సహితం "కమల మన అదృష్టంకొద్దీ మన యింటికోడలుగా లభించింది -" అని సంతోషిస్తున్నాడు.

సంజీవరావుమాత్రం - భార్యమొహల అనురాగం ప్రదర్శిస్తున్నా, అప్పుడప్పుడు కోపంతో ఆమెను బాధపెడుతున్నాడు.

ఏమయినా కమలమాత్రం అత్తింటవున్నా - ఒకేఒక అభిప్రాయంలో ఉండిపోయింది - తన భర్తకు - కోపం - తిక్కయెక్కువ అది అంతకంతకు వృద్ధి అవుతోంది. తాను ఆ కోపానికి ... తిక్కకు - వశం అయిపోతోంది ... దవడలు వాపవుతున్నాయ్! భర్త తిక్క - కోపం యేవిధంగా పోతాయో ఆమె కర్థం కావటం లేదు "అవి పోగొట్టడమెలాగ?" -

కమల ఆలోచిస్తూండగానే రోజులు గడుస్తున్నాయ్ ... కమలసమస్య సమస్యగానే వుండిపోతూంది...

రాజేశ్వరి కళ్ళనీళ్లు పెట్టుకొనేది. "అంతా నాఖర్మం బంగారంలాంటిపిల్ల దెబ్బలతో నలిగిపోతూంది. వాడికి చేతు లెలా వస్తున్నాయో కొట్టడానికి. వెధవకోపం వాడూను ఆకోపం యెప్పటికి పోతుందో యేమో" అనుకునేది...

అందరి అనురాగంతో బాటూ - ఆ దెబ్బల అనురాగంతోటూ కమల రోజులు సాగిపోతున్నాయ్...

* * *

కమల పుట్టింటికి వచ్చింది ... ఇంట్లో వాళ్లంతా కమలను కొత్తగా చూశారు:

"ఇప్పుడయినా మీ ఆయనకు కోపం తగ్గిందా?" - అని నవ్వుతూ అడిగింది తల్లి!

"కోపం తగ్గితే - అక్కయ్య అలా యెందుకు చిక్కిపోతుందమ్మా?" - అన్నాడు కమల తమ్ముడు.

కమల సిగ్గుతో తల దించుకొంది!

"బావకోపం - తిక్కా తగ్గడానికి యేమైనా మందు దొరికితే బాగుండును" అన్నాడు కమల చిన్నతమ్ముడు!

"అవును" - అని కమలతల్లి అంటూంటే - అంతా ఒక్కమారుగా నవ్వారు. కమల సిగ్గుతో తల వంచుకొంది

* * *

ఒకదినం - సాయంకాలం -

కమలను చూడటానికై ప్రక్క వీథిలో వుంటున్న ప్లీడరుగారికోడలు యిందిర వచ్చింది.

ఇందిరను, కమలతల్లి పరిచయం చేసింది: "ఈవిడది మీ అత్తవారివూరే...! అన్నట్లు...మీ ఆయనా- ఈమే కలసి చదువుకొన్నారట" అని...

ఇందిర నవ్వింది.

కమల - సిగ్గుతో ఇందిరవయిపు చూసింది.

కమలతల్లి యేదో పని మీద వంటయింట్లోకి వెళ్ళిపోయింది ... కొత్తగా పరి



 క టుం కు 

చయులైన యిద్దరు స్నేహితురాండ్రూ అనేక విషయాలు మాట్లాడుకొన్నారు. ఆ మాటలసందర్భంలో ఇందిర నవ్వుతూ: "ఏమండీ? మీ ఆయనకోపం యేలాగుంది?"- అని అడిగింది.

కమల చెప్పలేక వెలవెలబోయింది:

ఇందిర నవ్వుతూ! "మీరు చెప్పక పోయినా...నాకంతా తెలుసండీ ... మేం ఒకేవూరివాళ్లం. మీ ఆయనకు పెద్దగా కోపం అని - తాబట్టిన కుందేటికి మూడే కాళ్లని మీరు భయపడతారుగానీ నిజంగా ఆయన పిరికిమనిషి! - ఆయనదంతా మేక పోతుగాంభీర్యం..."

కమల తెల్లబోయి చూసింది. "మీ మాటలు నాకర్థం కావటంలేదు" - అంది.

ఇందిర నవ్వుతూ చెప్పసాగింది: "నా మాటలు మీకర్థం కాకపోయినా - నే చదువుకొనేరోజుల్లో జరిగిన కథ వింటే - మీకంతా అర్థం అవుతుంది: -

మీ ఆయనతో బాటు సరళ అనే అమ్మాయి చదువుకుంటూండేది; ఆమె అందగత్తె అవటంవల్లా, భాగ్యవంతుల పిల్ల అవటం వల్లా, చదువు సంస్థలో తరగతికి ముందుగా వుండటంవల్లా - తరగతిలో అందరినీ ఆకర్షించేది. కొత్తగా తయారైన ఫాషన్లేమైనా వుంటే - అవి ఆమెదగ్గరే ప్రారంభ మవుతూండేవి.

ఆ అమ్మాయంటే తరగతిలో మొగపిల్లలందరికీ వేళాకోళంగా వుండేది. అందరూ తలో కొత్తపేరూ పెట్టి - ఆమెను నోట్లో వేసుకుంటూండేవారు.. నలుగురితో బాటూ నారాయణా అన్నట్లు మీవారుగూడా ఆ అమ్మాయికి ఒక పేరు పెట్టారు! ఆ పేరు ఆకర్షణీయంగా వుండటంవల్ల - అందరి పిల్లలూ ఆ పేరుతోనే సరళను పిలవ సాగారు" - ఒకమారు ఆగి కమలవయిపు చూసి నవ్వింద ఇందిర!

"ఆ అమ్మాయి హెడ్‌మాస్టారికి రిపోర్టు చేసిందా?"- అమాయకంగా అడిగింది కమల.

"సరళ అంత తెలివితక్కువది కాదు. మేమంతా రిపోర్టు చేయమన్నాం. కాని ఆమె: 'ఇంత చిన్నవిషయం హెడ్మాష్టరు దగ్గరకెందుకూ... నేనే దాన్ని పరిష్కరిస్తాను' - అంటూ మాతో చెప్పింది.

మర్నాడు—

తరగతిలో సరళ యేకాంతంగా మీవారిని కలుసుకుని 'మీతో మాటాడా లనుకొంటున్నాను' అందట

మీవారు ఉబ్బిపోయి 'సరే'—అన్నారట.

'నాకు-పేరు పెట్టింది మీరేకదూ?' - నవ్వుతూ అడిగిందట సరళ.

'ఆ నేనే'—అన్నారట మీవారు.

'చాలా బాగుంది కాదూ?'—అందిట సరళ.

'ఆ...ఇంతకీ మీరు మాటాడాల్సినదేమిటి?'—అని ప్రశ్నించారట మీవారు.

"ఏం వుందిలెండి......అంత చక్కటి నామం - నాకు యిచ్చిన మీకు కృతజ్ఞత చెప్పకొని బహుమానం యివ్వాలనే తలంపు నాకు కలిగింది...ఆ బహుమానం అందరిలో యివ్వటంకంటె - మీకు - యేకాంతంగా యివ్వటం సబబుగా తోచటంవల్ల మిమ్మల్ని కలుసుకొన ప్రయత్నించాను. నేటి కది సమకూడింది. ఇక మీ బహుమానం'— అంటూ సరళ—

ఒక వయిపు మీవారు తెల్లబోతూండగా 'ఇగుగో'—అంటూ అరయిదు వేళ్ళూ అంటేలా దవడమీద వాయించిందట...ఈ సంగతి సరళ తర్వాత మాకు చెప్పింది"—

"తర్వాత"—అంది ఆదుర్దాగా కమల.

"తర్వాత యింకేముంది? దవడవాయించి సరళ వెళ్ళిపోయింది మీవారు వాచిన దవడ మూలకంగా వారం రోజులు బడికి రాలేదు. అంతే కాదు - ఆడపిల్లలంటే - ఆసక్తి చూపించే మీవారు గాని తరగతిలో వుండే యితర విద్యార్థులు గాని అప్పటి నుంచీ-మావయిపు కన్నెత్తి చూస్తే వొట్టు. మమ్మల్ని గురించి-తిరిగి ఒక్క మాటయినా అన్నది లేదు. మీవారు అప్పటినుంచీ-యెక్కడయినా - మేం కన్పించినా - తలదించుకు నడిచేవారు. సరళ పేరు యెవరయినా చెబితే గజగజలాడిపోయేవారు; అందువల్ల-నే చెప్పే దేమంటే-మీవారిది కచ్చితంగా మేకపోతుగాంభీర్యం .."

అని నవ్వింది ఇందిర.

"అంతేనంటారా?"— అంది ఏమిటో ఆలోచిస్తూ కమల!

"అవునో కాదో యీమారు ప్రత్యక్షంగా - మీరే చూడండి. చీకటి పడుతూంది......వస్తాను"—అంటూ ఇందిర లేచింది:

"ఉండండి బొట్టు పెడ్తాను"—అని, కమల బొట్టు పెట్టింది. తరవాత భర్తను గురించి ఆలోచించసాగింది.

* * *

కమల పుట్టింట వుండగానే భార్య కోసం సంజీవరావు వచ్చాడు. ఆ రాత్రి కావాలని - కమల యేదో తప్పిదంచేసింది.

కోపం అప్పటికప్పుడే సంజీవరావులో ప్రవేశించింది...అతగాడు వళ్లు తెలియని కోపంలో: "నీకేం బుద్ధిలేదూ?"అన్నాడు.

"లేకేం"—అంది కమల కటువుగా.

ఆ మాట - సంజీవరావుకు మరింత కోపాన్ని తెప్పించింది...

"ఉంటే యేమిటిది?"—అంటూ కమలను కొట్టడంకోసం చేయెత్తబోయాడు సంజీవరావు.

కమల వుగ్రరూపం తాల్చింది: "కొట్టండి మీకు చేతనైన విద్య అది వొక్కటేగా. లోకువగా వున్నాను కనుక యింతకాలం - నన్ను బాదారు; నా ముఖాన్ని వికృతంగా చేసిపారేశారు. మీకు చేతనైంది కోపం తెప్పించుకోటం; లోకువగా వున్నవాళ్లను చితక బాదటం. మీరు నన్ను యెన్ని విధాలుగా బాధించినా - యేడ్పించినా సహించాను; సహిస్తున్నాను. మీ దెబ్బలతో నా వొళ్లు కాయలు గాచిపోయింది. కానీ నేను కనుక మరోలా ప్రవర్తిస్తే? అదెంతసేపు! అంతెందుకూ? నేనుమాత్రం తల్చుకుంటే మీ క్లాసుమేటు సరళ మాదిరిగా చేయలేనూ?..."

—ఈ విధంగా కమల మాట్లాడుతూంటే సంజీవరావు వెలవెల బోయాడు. సరళ పేరు వుచ్చరించటంతోటే, అతని వదనం వాడిపోయింది...చేతులు వణికాయ్; కళ్లు చమర్చాయ్.

కమల యింకా యేమేమో అని "...ఊ కొట్టండి. మీకు చేతనైంది అది ఒక్కటేగా" అని వుద్రేకంతో అంటూంటే—

సంజీవరావు గజగజ వణికిపోతూ, చమర్చిన కళ్లు తుడుచుకుంటూ—

"కమలా! ఇంతవరకూ నీకు చాలాఅన్యాయం చేశాను. నన్ను క్షమించు ... నా వొళ్లు నాకు తెలియని వుద్రేకపరిస్థితిలో నిన్ను కొట్టాను. నేటితో నాకు బుద్ధి తెలిసివచ్చింది. ఇక మరోవిధంగా మసలను"—అన్నాడు.

కన్నీటితో నిండిన కమలవదనం—కలకల లాడింది—

ఆమెను భర్త క్షమించమని కోరినందుకు కాదు—ఆమె కిటుకు పారినందుకు. ★




# దొంగపాపాయి

'అశని'

పాపాయికి స్వర్గానికి
పరుగెత్తా లనిపిస్తే
చక్కనైన పిట్టలాగ
చుక్కలలో కెగురగలదు—

కాని......

అమ్మ పెద్ద గుండెమీద
ఆనుకు నిదురించే—ఈ
హాయిని తానెట్లా—పా
పాయి విడిచిపెడుతుంది?

* * *

పెద్దపెద్ద విషయాలను
ఒద్దికతో చెప్పగలుగు
పద్ధతులన్నీ కూడా
పాపాయికి అవగతమే—

కాని......

అమ్మ జిలుగు పలుకుల్లో
అమృతాలను తాగాలని
దొంగపాప మాటలన్నీ
నంగిగాను పలుకుతుంది

* * *

బంగారపు గనులూ—కదు
సింగారపు మణులూ, మన
పాపకు కల వెన్నెన్నో
పసిపాపల లోకంలో—

కాని......

తల్లిప్రేమ ధనాల—కో
కొల్లలు తన కనుల్లో
ఏమీ లేకుండా ఈ
భూమికి పాప దిగింది.

* *

ఏడ్పంటే పాపాయికి
ఏమాత్రం పనికిరాదు.
చిరునవ్వులె నవ్వాలని
చిరుపాపకు కడుసరదా.

కాని......

అలా గనక తను చేస్తే
అమ్మ వచ్చి ఎత్తుకోదు
అందుకనే దొంగపాప
అల్లరిగా ఏడుస్తుంది.

(రవీంద్రుని ఆధారంతో)




# నక్క - ద్రాక్షపళ్లు

ఆ వనములో మనము
అడుగిడిన చాలును.
ద్రాక్షఫలములు కొన్ని
లక్ష లగుపించును.

ఎత్తయిన తీగెలకు
గుత్తులుగ కాయును.
ఉయ్యాల లూగి, నో
రూరించివేయును.

ఆకలితో నొక నక్క
ఆ యడవి కరిగెను.
స్వచ్ఛమగు ద్రాక్షఫల
గుచ్ఛముల గాంచెను.

చెట్టు చెట్టున కరిగి
లొట్టలది వేసెను.
చెట్టుచెట్టున కెగిరి
పటుకో జూచెను.

అందినట్లే అంది
అందకే పోయెను.
ఎంత సేపెగిరినా
ఎగురుటే మిగిలెను.

నక్క అపుడనుకొన్న
దొక్క క్షణమాత్రము ;
"ఎంత ఎగిరిన అంద
వేమిటీ చిత్రము ?"

పట్టుదల మానుకొని
ఇట్టు లనుకొన్నది:
"అనవసర మీ ఫలము
లనిపించుచున్నది.

పండుద్రాక్షలు కావు,
పచ్చివని తోచును.
పుల్లగానుండు ఈ
పళ్లెట్లు తిందును ?"

అని నక్క బింకమున
వెనుదిరిగి పోయెను.
కవియైన పికమొకటి
కాంచెనీ వింతను.

ద్రాక్షఫలములుమెక్కి
రసమెల్ల గ్రోలెను.
ఎలుగెత్తి యొకగీతి
నీరీతి పాడెను :

"అందినపుడు పచ్చిద్రాక్షలైనా తియ్యనివే!
అందనపుడు పండుద్రాక్షలైనా పుల్లనివే!
అందరాని చందమామ కాసపడగనేలా!
అందరాని అందాలను నిందింపగ నేలా?
కావ్యరసమువలెనే, ద్రాక్షారసమ్ముకూడా
నేలవిడిచి నింగికెగురు నేర్పరికేగాదా ?

ఈసప్ కథలు : 4

నండూరి రామమోహనరావు



నీతి

అందినపుడు పచ్చిద్రాక్ష
లైనా తియ్యనివే.

అందనపుడు పండుద్రాక్ష
లైనా పుల్లనివే.

# స్కార్లెట్ పింపర్నెల్

మూలం: బారనెస్ ఆర్జీ

అనువాదం: ము. వీరభద్రశాస్త్రి

## 9

విందుభోజనం ముగిసింది. "వెధవది! ఇంతబతుకు బతికి—" సర్ పెర్సీ మధ్యమధ్య అంటూవచ్చిన పాడిముక్కలు మహాపసందుగా ఉన్నాయి ఆనాడు. చుట్టూ చేరిన జనం అవి విని విరగబడి నవ్వారు. వేల్సు యువరాజయితే నవ్వి, నవ్వి, కొంతసేపటికి ఇక నవ్వలేక కళ్ళనీళ్ళపర్యంతమైనాడు.

"ఇక్కడ. ఉన్నాడిడుగో! అనుకొని" అన్న ఆ గేయం వల్లించటం ఎవ్వరూ ఆపలేదు. గ్లాసులు, ప్లేట్లు, మోగిస్తూ బుద్ధిమంతులు కొందరు తాళాలుకూడా వేసి హంగుచేశారు.

మార్గరెట్ బ్లాకనీ హృదయంలో తుపానురేగుతున్నది. గడియారంముళ్ళను తోసుకుంటూ కాలం నిర్దాక్షిణ్యంగా పరిగెత్తుకుపోతున్నది. పన్నెండు గంటలు దాటినాయి.

ఆంద్రూని వంచించి ఆ కాగితంలో చూసిన మాటలు మళ్ళీ మళ్ళీ తలపునకు వస్తున్నాయి. ఆమె అదృష్టంకొద్దీ ఆ కాగితంలో సరిగా ఏముక్కలు అత్యవసరంగా తెలుసుకోవాలో ఆ ముక్కలే ఆమె కంటబడినాయి. తక్కినమాటలు నిప్పుముట్టించటంవలన పొగచూరిపోయినాయి. "రేపు నే నే బయలుదేరుతున్నా.........నాతో మాట్లాడవలసిన దేమన్నా ఉంటే, సరిగ్గా ఒంటిగంటకు భోజనశాలలో ఉంటాను." అవి ఆమెకు తెలిసినమాటలు.

ఒంటిగంట కావటానికి మరొకగంట వ్యవధి ఉన్నది. ఈ అరగంటలో తన అదృష్టం, ఆర్మండ్‌కు రాసిపెట్టి ఉన్నగీత బయటపడుతాయి. మార్గరెట్ ఏమిచేయాలో నిశ్చయించుకోలేకపోతున్నది. తన అన్నకోసం ఆ మహావ్యక్తిని బలిపెట్టటమా? లేదా తన ఆర్మండ్‌ను చేతులారా చంపుకోవటమా?

తన రహస్యం బయటపడిపోయిన సంగతి ఆర్మండ్‌కు తెలియదు. అనవసరంగా పోయి మృత్యుగహ్వరంలో చిక్కుకున్నాడు. తాను అతని ప్రాణాలు రక్షించగలదు. దేవుడు అందుకు తగిన వీలు కల్పించాడు. అయినప్పటికీ, అతనిని రక్షించకుండా ఊరుకోవటమా?

ఆర్మండ్ ఆమెకళ్ళముందు కనిపించి "ఏం మార్గరెట్? ముక్కు మొహమూ తెలియని ఎవడి ప్రాణాలకోసమో నన్ను చంపిస్తావా? ఇదేనా నీ సోదరప్రేమ?" అని అడుగుతున్నట్లు తోచింది.

షావలిన్ తనకోసం చూస్తూ ఉంటాడు. మాట్లాడటానికి తగిన అవకాశం ఎప్పుడు వస్తుందా, తాను వేసిన ఉచ్చులు ఎంతవరకు బిగిసినాయా అని చూడటానికి కనిపెట్టుకొని ఉంటాడు. గుంటనక్కలా కళ్ళు వాడూ ఏమూలనో, దేనిచాటునో నిలబడి తనను పరిశీలిస్తూ ఉంటాడు అనుకున్నది మార్గరెట్. ముఖాముఖి షావలిన్‌ను కలుసుకోవటానికి మార్గరెట్ సాహసం చెయ్యలేకపోతున్నది.

మార్గరెట్ చెయ్యవలసినపని విజయవంతంగా పూర్తిచేసిందని షావలిన్ ఎప్పుడో కనిపెట్టేశాడు. అతడు కనిపెట్టేశాడని, ఎప్పుడో సమయం చూసి వచ్చి,

తనకు ఎంత ఇష్టంలేకపోయినా ఆ విషయం బయట పెట్టేస్తాడని మార్గరెట్ కనిపెట్టింది.

భోజనాల అనంతరం కొందరు పెద్దవారు ఇళ్లకు వెళ్ళిపోయినారు. యువకులు, కుర్రకారువారు మాత్రం పోలేదు. పేకాటఆడేవారు పేకాడుతుంటే, మరొక ప్రక్కన సంగీతం, డాన్సులు, సాగిస్తున్నారు.

మార్గరెట్ ఒక మంత్రివర్యుడితో కలిసి వరండాలోకి వచ్చి అక్కడ కూలబడింది. ఆ మంత్రివర్యుడు చాలా చాలా చెప్పుకుపోతున్నాడు. మార్గరెట్ ఓపికగా వింటున్నట్లు కూర్చొన్నది. ఆమె చాలా శ్రద్ధగా వింటున్నదికదా అని అతడు మరింత ఉత్సాహంగా చెప్తున్నాడు. ఇంతలో పావలిన్ ప్రక్క కిటికీలోనుండి మార్గరెట్‌కు దర్శనమిచ్చాడు.

"లార్డ్ ఫాంకర్ట్! ఒక్క చిన్న పని చేసిపెడతారా?" అని అడిగింది మార్గరెట్.

ఉత్సాహంగా తాను చెప్తున్నది ఆపి, మరింత ఉత్సాహంగా లార్డ్‌ఫాంకర్ట్ "ఓ! తప్పకుండా. అంత కంటేనా?" అన్నాడు.

"సర్ పెర్సీ ఇంకా పేకాటదగ్గరనే ఉన్నట్లున్నారు. ఉంటే నాకు ఇంటికి పోవాలని ఉన్నదని చెప్తారూ?"

ఇంతమంత్రివర్యుడు ఆమెకు వార్తాహరుడై చిత్తమంటూ వెళ్ళిపోయినాడు. అతడు అటు వెళ్ళాడు. పావలిన్ ఇటు లోపలికి వచ్చాడు.

"నాకు చెప్పవలసినది ఏదో చాలా ఉన్నట్లున్నదే." అన్నాడు.

"పెద్ద విశేషాలేమీలేవు. సర్ ఆంద్రూదగ్గర నేనొక కాగితం పట్టుకున్నాను. అతడా కాగితం తగలబెట్టబోతుండగా పది సెకండ్లపాటు చేజిక్కించుకున్నాను."

"అందులో ఏముందో చూడటం పడిందా?" అన్నాడు పావలిన్ తాపీగా.

మార్గరెట్ 'ఆ' అని తలఊపింది. "ఆ కాగితంలో కింద ఎఱ్ఱటినక్షత్రంవంటి పువ్వుముద్ర వేసి ఉన్నది. పైన రెండంటే రెండువాక్యాలు మాత్రం చూశాను. తక్కినదంతా పొగచూరిపోయింది."

"ఏమిటి ఆ రెండు వాక్యాలు? చెప్పరాదూ!"

మార్గరెట్ కంఠం పూడుకొనిపోయింది. మాట పెగిలిరాలేదు. ఆ మాటలు పావలిన్‌కు చెప్పటంఅంటే ఇంగ్లాండుదేశ ప్రజలంతా ఆరాధిస్తున్న ఆ వ్యక్తిజుట్టు ఈ కిరాతకుడి చేతికి చిక్కించటమే.

పావలిన్ ఎత్తిపొడుపుగా "మంచిదే. అదీ నీ అదృష్టమే. కాగితంఅంతా పొగచూరిపోలేదు. ఇంతకీ మీ ఆర్మండ్‌కు ప్రాణాలు దక్కే యోగం ఉన్నట్లున్నది. ఊఁ! ఏమిటి ఆ రెండు వాక్యాలు?" అన్నాడు.

మార్గరెట్ అతనిని చురచుర చూసింది. "రేపు నేనే బయలుదేరుతున్నా...అని ఒకటి, నాతో మాట్లాడవలసిన దేమన్నా ఉంటే, సరిగ్గా ఒంటిగంటకు భోజనశాలలో ఉంటాను. అని ఇంకొకటి."

పావలిన్ తలఎత్తి గడియారంవంక చూశాడు. "ఓహ్! కావలసినంత వ్యవధి ఉన్నది." అన్నాడు.

పాలిపోయిన ముఖంతో, భయభ్రాంతులతో, బిత్తరచూపులతో మార్గరెట్ అడిగింది.

"అయితే ఇప్పుడు నీవేమి చేస్తావు?" పావలిన్ వెంటనే బదులుచెప్పలేదు. ఆమె మళ్ళీ మళ్ళీ అడిగింది.

"ఇప్పుడు ఉన్నపళంగా చేసేదేమీలేదు. భోజనశాలలో ఒంటిగంటకు ఎవరు ఉంటారో చూస్తే, ఆ తరువాత దాన్నిబట్టి ఉంటుంది."

"స్కార్లెట్ పింపర్నల్ ఉంటాడు. కాని నీవు అతనిని ఎరగవుకదా!"

"ఒకవేళ ఆంద్రూ ముందుగా హెచ్చరించి ఉంటే."

"హెచ్చరించలేదు. నాకు తెలుసు. నేను ప్రతిక్షణం కనిపెట్టుతూనేఉన్నాను. భోజనాలు అయినతరువాత నేను ఇటు వచ్చేముందు లేడీపోర్టేరిల్స్ అతనితో సుజేన్‌గురించి సంభాషణ మొదలుపెట్టింది. కనీసం ఇంకో గంటదాకా వదలదు. ఇప్పుడు ఐదునిమిషాలు తక్కువగా ఒకటి అయింది."

పావలిన్ వెళ్లిపోవటానికి బయలుదేరాడు. వాకిటికి కట్టిఉన్న తెర తొలగించి, దూరంగా అవతల మాట్లాడుతున్న లేడీపోర్టేరిల్స్‌ను సర్ ఆంద్రూను చూపించాడు. "చూశావా మార్గరెట్ సెంట్ జస్ట్ ఇన్నాళ్ళనుండి ఎవరి దివ్యముఖారవిందసందర్శనం కోసం ఎదురుచూస్తున్నానో ఆ మహాత్ముడు ఇప్పటికి ప్రత్యక్షం కాబోతున్నాడు. వస్తాను." అంటూ చిరునవ్వు నవ్వాడు.

మార్గరెట్‌కు ఒక చిన్నసందేహం వచ్చింది.



## స్కార్లెట్ పింపర్నల్



"ఒకవేళ అక్కడ ఒక్కరూ కాకుండా ఎక్కువమంది ఉంటారనుకో." అన్నది.

"ఉండనీ! ఉంటేమాత్రం ఏం? గడియారం సరిగ్గా ఒకగంట కొట్టినప్పుడు ఆ భోజనశాలలో ఎంతమంది ఉంటారో అంతమందినీ, నా అనుచరులు వెంబడిస్తారు. ఇందులో రేపు ఒక్కరో, ఇద్దరో, కాకపోతే ముగ్గురో బయలుదేరుతారు ఫ్రాన్సుకు. అందులో ఒకడు పింపర్నల్ అన్నమాటే గదా!"

"ఊఁ! అయితే."

"ఇంకా చెప్పేటందుకు ఏముంది?

"నేనుకూడా రేపే ఫ్రాన్సుకు బయలుదేరుతున్నాను. డోవరులో ఉండగా సర్ ఆండ్రూవద్ద నేను పట్టుకున్న కాగితాలలో ఒక హోటలుపేరు ఉన్నది. హోటలు గ్రిజ్. సముద్రతీరాన ఎక్కడో ఒకచోట కలేకు కొంచెందూరంలో 'బ్లాంచార్డ్ శిథిలకుటీరం' అని ఒకటి ఉన్నదిట. అది ఎక్కడో వెళ్ళి వెతకాలి. ఆ హోటలుమాత్రమే నాకు తెలుసు. ఇదిగో ఈ హోట్లలో ఎక్కడో ఆ ఇంగ్లీషుడింభకుడు ఉంటాడు. పారిపోదలచిన సన్యాసులంతా ఆ శిథిలకుటీరం దగ్గరకు వస్తారుట. రేపు ప్రొద్దున కలే బయలుదేరే ఆ మహార్షులలో ఎవడు ఈ శిథిలకుటీరంవైపుకు వస్తాడో అతడు పింపర్నల్. ఏడాదినుంచి నా ఎముకలు కొరుకు

తున్నాడు. ఇంతవరకు వైజ్ఞానికులను పీడిస్తున్నాడు. నా వంటివాడికికూడా దొరకకుండా తప్పించుకుంటున్న ఆ మనిషి అక్కడ మన చేతిలో చిక్కుతాడు. అంతే."

"మరి అర్మాండ్ మాట ఏమిటి?"

"కాదు మార్గరెట్. నేను ఎప్పుడయినా అన్న మాట తప్పానా? నేను, పింపర్నల్ ఎప్పుడు ఫ్రాన్స్ బయలుదేరుతామో, అప్పుడు మీ అన్నయ్య వ్రాసిన ఆ ఉత్తరం నీ చేతికి పంపిస్తాను. అక్కడ పింపర్నల్ నా సంకెళ్ళలో పడే వేళకు, మీ అర్మాండ్ ఇక్కడ

నీ కళ్లముందు ఉంటాడు. సరేనా?"

వినయంగావంగి మర్యాదచూపిస్తూ ఇంకొక్కసారి గడియారంవంకచూసి, పావలిన్ నిష్క్రమించాడు. మార్గరెట్ భారంగా నిట్టూర్చి అక్కడ ఉన్న ఒక సోఫాలో వెనుకకు చేరగిలబడి కళ్లు మూసుకున్నది.

పావలిన్ పిల్లిలాగా అడుగులు వేసుకుంటూ మెట్లుదిగి క్రిందికి వెళ్లాడు. గదులు హాలుదాటిపోయి భోజనశాల చేరుకున్నాడు. భోజనశాల గలభాగాఉండి, చిన్నపోతున్నది. అడ్డదిడ్డంగా పడిఉన్న కుర్చీలు, టేబిల్ మీద తళతళ మెరుస్తున్నగ్లాసులు, గ్లాసులలో వెలితి వెలితిగా ద్రాక్షసారా, కబుర్లు చెప్పుకుంటూ అతిథులు దగ్గరకు ఈడ్చుకున్న కుర్చీలు జతలు జతలుగా, ఒక్కొక్కచోట మూడునాలుగుగా ఉన్నాయి. కొవ్వువత్తులు మనక మనక వెలుగునిస్తూ నిద్రవస్తున్న వాని ముఖంలా ఉన్నాయి.

పావలిన్ గడ్డం అరచేతితో రుద్దుకుంటూ, ఆ దృశ్యంచూసి నవ్వుకున్నాడు. భోజనశాలఅంతా నిశ్శబ్దంగానే ఉన్నది కాని దూరంగా ఉన్న గదులనుండి నవ్వులు, కేరింతలు వాద్యసంగీతం, ఒకే హోరులాగా వినిపిస్తున్నాయి.

ఇకమీదట ఏమిచేయాలి అనే కర్తవ్యవిచారణలో పడ్డాడు పావలిన్. ఈ పింపర్నల్ ఎవరు? ఎలా ఉంటాడు? అతని తత్త్వమేమిటో, అతనికి ఉన్న శక్తు లెటువంటివో ఎవ్వరికీ అంతుపట్టలేదు. అత డెవ్వరో తెలియకపోవటంచేత ఊరుకున్నారేగాని లేకపోతే ఇంగ్లీషువారంతా అతనిని నెత్తిన ఎక్కించుకొని ఊరేగేవారు. ఎంతమాత్రం సందేహంలేదు.

పింపర్నల్ పేరు తలచుకొని ఫ్రాన్సుప్రజలు జలదరించిపోతున్నారంటే, అందులో ఆశ్చర్యం ఏముంది? పావలిన్‌వంటి గుండెలుతీసిన బంటు, అంతటి తెలివిగలవాడు, ఆ ఒంటరిచోట నిలబడి పింపర్నల్ ఎటునుండి వచ్చి ప్రవేశిస్తాడో, ఏ విధంగా అక్కడ ప్రత్యక్షమౌతాడో అనుకొని ఒకసారి చుట్టూ కలయజూచి, నిలువునా వణికిపోయినాడు. భూమిలోనుండి పుట్టుకువస్తాడో, మబ్బులోనుండి ఊడిపడతాడో, అన్నట్లు క్రిందామైనా చూశాడు. వెన్నులోనుండి అదురుపుట్టుకు వచ్చింది.

అయితే పావలిన్ తాను అనుకున్నది అనుకున్నట్లు సలక్షణంగా జరిగిపోతున్నందుకు సంతోషించాడు. బహుశా సర్ ఆండ్రూకాని, మరొకరుగాని అతనిని హెచ్చరించిఉండరు. మార్గరెట్ బ్లాకెనీ తనకు మోసంచేసి ఉండటానికి వీలులేదు. మోసమే చేసి ఉంటుందా? ఈ ఆలోచనతో అతని చూపులు తీక్ష్ణములయినాయి. ఆక్షణాన మార్గరెట్ అతనినిచూసిఉంటే, గిలగిల కొట్టుకొని అక్కడే చచ్చిపడిఉండేది. శతవిధాల ఆమె మోసంచెయ్యదు. చేసిఉంటుందా! ఆర్మండ్‌ను నిర్దాక్షిణ్యంగా ఉరితీయటమే! అనుకున్నాడు పావలిన్.

అదృష్టవశాత్తు భోజనశాలలో ఎవ్వరూ లేరు. అందువలన పావలిన్‌పని మరింత తేలిక అయింది. ఇక పింపర్నల్ వస్తాడు వస్తాడు అనుకుంటూ సంబరంగా చుట్టూచూశాడు పావలిన్.

ఇంతలో పావలిన్‌కు ఎవరో దగ్గరలో ఉండి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తీస్తున్నట్లు వినిపించింది. ఎవరో లార్డ్ గ్రెన్విల్ అతిథులు మస్తుగా ఎక్కించిఉంటారు. భోజనశాలలోనుండి బయటికి పోయేపాటి ఓపికకూడా లేక ఇక్కడే నిద్రకుపడిఉంటారు అని పావలిన్ తలపోసి నవ్వుకున్నాడు. పరిశీలనగా ఎవరా నిద్రపోతున్నది అని వెతికాడు.

అక్కడే ఒకమూల ఒక సోఫాఉన్నది. ఆమూల ఎక్కువగా వెల్తురు లేదు. ఆ సోఫామీద నోరుతెరుచుకొని, కళ్లుమూసుకొని నిద్రాసౌఖ్యం పొందుతూ, వెల్లకిలా పడుకున్నాడు "యూరప్‌లో కెల్లా తెలివిగలదైన" మార్గరెట్ సెంట్ జస్ట్ భర్త - లండన్ మందమతి.

హాయిగా తిని, చీకు చింతా లేకుండా మైమరచి నిద్రపోతున్న ఆ భారీమనిషిని చూస్తూఉండగా పావలిన్‌కు అసూయకలిగింది. ఎవరో కొద్దిమందిగాని అలా జీవితం గడపలేరు అనుకున్నాడు. వళ్ళుమరిచి నిద్రపోతున్న అతనివలన తన ప్రయత్నాలకు ఎటువంటి ఆటంకమూఉండదని మనస్సు సరిపెట్టుకుంటూ పావలిన్ అక్కడ ఉన్న మరొక సోఫామీద కూలబడ్డాడు. చేతులు నలుపుకుంటూ వెల్లకిలా పండుకొని ఆలోచనలలో పడ్డాడు. పింపర్నల్ కోసం కనిపెట్టుకుని కూర్చున్న అతనికి నిద్రాదేవి ముందు స్వాగతమిచ్చింది. మరి కొన్నిక్షణాలలో హాయిగా గురకపెడుతూ, నిద్రపోతూ పావలిన్ పింపర్నల్ కోసం కనిపెట్టుకొని ఉన్నాడు!

# 10

మార్గరెట్ ఒంటరిగా కూర్చొని "పావలిన్ బహుశా ఈపాటికి భోజనశాలకు చేరిఉంటాడు. ఇదుగో ఒకటి కాబోతున్నది. ఈపాటికి పింపర్నల్ అతనికి కనిపించిఉంటాడు. ఇంతకీ అక్కడ ఎంతమంది ఉన్నారో!" అనుకోసాగింది. తానుకూడా వెళ్ళి చూడాలనుకున్నది. కాని ముఖంచెల్లలేదు. కదలకుండా, మెదలకుండా అక్కడే కూర్చున్నది. కుంజర యూథంబు దోమ కుత్తుక జొచ్చెన్ అన్నట్లు స్కార్లెట్ పింపర్నల్ అతని అనుచరులు పావలిన్ చేతుల్లోకి చిక్కిపోవటమా అని బాధపడింది.

ఇంతలో లార్డ్ ఫాంకర్ట్ తిరిగివచ్చాడు. "క్షమించాలి మార్గరెట్! చాలా ఆలస్యమైంది. ఎక్కడ వెతికినా మీ ఆయన కనిపించనిదే!"

పెర్సీని వెతికి రమ్మని లార్డ్ ఫాంకర్ట్‌ను పంపించిన సంగతే మరిచిపోయింది మార్గరెట్.

"ఎలాగైతేనేం చివరికి పట్టుకున్నాను. చెప్పాను నీవు చెప్పినమాట-బండి సిద్ధంచేయిస్తానన్నాడు." అని చెప్పాడు ఫాంకర్ట్.

"ఓహో! చెప్పారా? సరేలెండి."అన్నది మార్గరెట్ పరధ్యానంగా.

"మీ ఆయన ఎక్కడ ఉన్నాడో తెలుసా? భోజనశాలలో పడుకొని చక్కగా నిద్రపోతున్నాడు. ఒకపట్టున లేవలేదు."

పావలిన్ చూసివచ్చి ఎవరు కనిపించారో ఏమిటో చెప్పలేదేమిటా? అని ఆలోచిస్తున్న మార్గరెట్ అతడు చెప్పినమాటలు సరిగా మనసుకు ఎక్కించుకోలేదు.

"సరేగాని, సర్ పెర్సీకాక ఇంకా ఎవరన్నా ఉన్నారా అక్కడ ?" అని అడిగింది మార్గరెట్ పావలిన్ వృత్తాంతం తెలుసుకుందామన్న కుతూహలంకొద్దీ.

"ఫ్రెంచి రాయబారి లేడూ పావలిన్! అతడు ఇంకోసోఫాలో పడి నిద్రపోతున్నాడు."

"అప్పుడు టైమెంతయింది?"

"ఒకటీ అయిదో, పదో అయింది ఏం?"

"అబ్బే ఏమీ లేదు."

మార్గరెట్‌కు ఆలోచన తెగలేదు. తను చెయ్యవలసిన పని చేసింది. పావలిన్‌కు పింపర్నల్ దొరికినట్లా లేదా? లేకపోతే, ఇంతకష్టపడి అర్మండునుదక్కించుకోలేకపోవటమే కదా!

మార్గరెట్ సరిగా మాట్లాడనందుకు లార్డ్ ఫాంకర్ట్‌కు చిరాకువేసింది. "బండి సిద్ధంగా ఉన్నదేమో చూచివస్తాన"ని వెళ్లిపోయినాడు.

ఫాంకర్ట్ వెళ్లిపోయిన తరువాత పావలిన్ వచ్చి పర్యవసానమేమైందో చెప్తాడని మార్గరెట్ ఆశించింది కాని ఎంతసేపటికీ పావలిన్ అంతుపొంతు లేదు.

ఈసారి లార్డ్ గ్రెన్విల్ స్వయంగా వచ్చి బండి సిద్ధంగా ఉన్నదని చెప్పాడు. మార్గరెట్ సెలవుతీసికొని బండిదగ్గరకు బయలుదేరింది. ఆమె వెళ్లిపోతున్నదని తెలిసి చాలామంది దగ్గరకు వచ్చారు. ఆ వచ్చినవారందరివద్ద సెలవుతీసుకుంటూ ఉండగా, ఆమెకు పావలిన్ కనిపించాడు.

పావలిన్ ముఖభంగిమను బట్టి ఏం జరిగిందో కనిపెట్టాలని మార్గరెట్ ప్రయత్నంచేసింది. సమస్య తేలీతేలని స్థితిలో ఏమీ పాలుపోకుండా ఉన్నట్లు కనిపించాడు పావలిన్.

మార్గరెట్ ఆదుర్దాగా పావలిన్‌ను దగ్గరకు పిలిచింది. "ఏమైంది పావలిన్?"అని అడిగింది.

పావలిన్ వ్యంగ్యంగా కసిగా ఇకిలించాడు. "ఏమైందా? ఏమి కావాలో అదే అయింది."అన్నాడు.

(ఇంకావుంది)

# పిల్లలు పిల్లిపిల్లలా?

## గరిమెళ్ల వెంకట సీతారాం

'వెధవకి ఏడేళ్లు వచ్చేయి. అన్నం తినడంకూడా చేత కాదు' అని అమ్మ కష్టా అన్నం కలిపి పెడ్తుంది. నోట్లో ఓ ముద్ద కుక్కింది. ఏడేళ్ళంటే ఏడుపు వచ్చినంత



"ఏదీ, ఇంకో ముద్దు పెట్టు"

వీనస్ స్టూడియో—ఏలూరు.

ఎంచేతఅంటే క్లాసులో ఓనాడు లెక్క తప్పు చేస్తే మేష్టారు అన్నాడు:

'ఓరి వెధవా ఏడొచ్చిందేంట్రా అన్నరు. ఏడు వచ్చినవాళ్ళ పని ఏడుపేనురా' అని అంటూ ఒకటి చరిచేడు. నిజంగా ఏడుపు వచ్చింది. గట్టిగా ఏడ్చేశాను ఆవేళ.

ఇవాళ అమ్మ అనేవరకు కూడ నాకు తెలీదు నాకు ఏడేళ్లు వచ్చినట్టు.

అందుకే శామోసు రోజూ నా పని ఏడుపే అవుతున్నది.

బడికి వెళ్ళకపోతే నాన్న కొట్టాడు. బడికి వెళ్ళితే మేష్టారు చావకొడతాడు.

అన్నం తినకపోతే అమ్మ బాడేస్తుంది. అన్నం తింటూంటే 'వెధవ తట్టెడు తింటాడు. ఆ ధ్యానం చదువులో వుంటే బాగుండును' అని అమ్మా నాన్నా చూడకుండా అన్న తనవంతు మొట్టికాయలు ఇస్తాడు.

ఇస్త్రీబట్టలు తొడుక్కొంటే 'అన్ని బట్టలూ ఒక్కసారే వాడేస్తున్నాడు. చాకలి మళ్లా ఎన్నాళ్లకొస్తాడో' అని అక్కగారి సాధింపు.

పాత బట్టలే తిరిగి వేసుకొంటే 'ఏమిట్రా గుడ్డలు కంపు కొడుతున్నాయి. కంపు వెధవా ఫో గుడ్డలు మార్చుకో' అంటుంది అమ్మ.

ఎలా చావడం?



"ఏదీ, ఇంకోగుక్కపట్టు"

ఫొటో: పి. హనుమంతరావు - ఈమని.

ఏదైనా చేస్తే తప్పు - చెయ్యక పోతే తప్పు.

ఇంటిల్లిపాది ఎవరు వంతు ప్రకారం వాళ్ళు ఒకరు చూడకుండా ఇంకొకరు బాదేస్తుంటారు రోజూ.

ఏడేళ్ళు ఒచ్చేయి అని చెప్పింది అమ్మ. అందుకే కామోసు యీ ఏడు అంతా ఏడుపే అవుతున్నది నాకు.

వేసంగి శెలవలొచ్చేయి. అమ్మా నాన్న ఎక్కడికో ఊరు వెళ్ళడానికి పెట్టె బేడా సర్దుతున్నారు.

ఎక్కడికో నాకు తెలీదు. నన్ను తీసుకెడ్తారో లేదో కూడ తెలీదు.

అక్కడికీ అడిగేను అమ్మని. వినిపించుకోలేదు. సాయంత్రం జట్కా వొచ్చేక నన్ను కూడ ఎక్కించేరు జట్కాలో. బహుశా అమ్మని నాన్నని విడిచివుండలేనని కామోసు. విడిచి వుంటేనే నాకెంతో బాగుంటుంది.

మామయ్యగారి ఊరు చేరేం. మధ్యాహ్నం 12 గంటలుఅయింది. ఎండ పేల్చేస్తోంది. అమ్మ నాకు అన్నం పెట్టించి, నేను తిన్నాక

'వెళ్లి నాన్నపక్కలో పడుక్కో. ఎండలో తిరక్కుండా' అని అంది.

ఇంటివద్ద ఎప్పుడూ నేను మధ్యాహ్నం పడుకొని ఎరగను.

అయినా యిప్పుడు పడుకోక తప్పిందికాదు. పడుకొన్నాను. కాని నిద్రపట్టలేదు.

ఇంతలో వంటింట్లో ఆ యింటి వాళ్ళ నాన్న అంటే మా మామయ్య

'చీనూ చీనూ' అని పిలిచేడు.

చీను వొచ్చినట్టుగా ఉంది.

'ఎక్కడికి పోయేవురా......నీ కోసం కనిపెట్టుకొని కూర్చొన్నాం. దా అమ్మా దా.అన్న ఏడీ ఎక్కడికెళ్లేడు' అని మామ అంటున్నాడు. కాని చీనేమీ మాట్లాడలేదు.

ఆ చీను అన్నవాడు వాళ్ళ చిన్నపిల్లాడులాగున్నాడు., వీడి

# ★ పిల్లలు పిల్లి పిల్లలా ★

కన్న పెద్దవాడొకడు వీళ్ళన్న ఒకడు ఉన్నట్టుగ ఉంది. వాడింకా భోజనానికి రాలేదు.

'మా నాయనవు కదూ పప్పు అన్నం తినెయ్యాలి గబగబ. తరువాత పెరుగు వేసుకుందువుగాని.'

చీను తినడం ఆరంభించేడు కాబోసు పై కేమీ మాటా మంతీ లేదు.

ఇంకా మాతుత్యో చెప్పుకు పోతున్నాడు.

'పొద్దున్న కూడ పాలు తాగ లేదు. ఇలా తినకుండా తిరుగుతే ఎలా చెప్పు. అందరిళ్ళలోను ఏవో తింటుంటావు. అన్నం సయించకుంటే ఎలా సయిస్తుంది.'

బాగానే వుంది. ఈ చీనుకి వాళ్ళన్నకి ఉదయం పాలు కూడ యిస్తున్నారన్నమాట. భేష్ వీళ్ల పనే బాగుం దనిపించింది నాకు.

'ఒసేయ్, వాడుకూడ వచ్చేడే. వాడికి వేరే ఇంకో కంచంలో పెట్టించు. ఇదేమిట్రా అంతా కొత్త మొఖాల్లాగున్నాయి అని చూస్తున్నావా? వాళ్లు మనవాళ్లేనురా.'

'ఏంరా నానీ! అన్నం తినకుండా ఎక్కడరా తిరుగుతున్నావు ఎండలో' అని అడిగింది వాళ్లమ్మ.

నాని సమాధానం చెప్పలేదు. ఏం చెప్తాడు? బడి విడిచిపెట్టేక పిల్లిద్దరు కలిసి ఎక్కడో గోణీబిళ్ళ ఆడుకోడానికి పోయిఉంటారు.

చీనుని, వాళ్ళన్న నానిని చూడాలని నాకు బుద్ధి పుట్టింది. కాని పడుకొన్నాను. లేస్తే అమ్మ ఏమంటుందో?

ఆ పిల్లల పనే బాగుంది. వాళ్ళ అమ్మా నాన్న వాళ్ళనేమీ కోప్పడరు. వాళ్ళు ఎక్కడెక్కడో తిరుగుతుంటారు. ఎప్పుడో వొచ్చి భోంచేస్తారు. వాళ్లు వచ్చేవరకు వాళ్ళమ్మ కనిపెట్టుకొని ఉండి వొచ్చేక దగ్గరుండి అన్నం తినిపిస్తుంది.

నాన్న లేచేక నేనూ లేచేను. కాని పిల్లల్ని చూదామంటే వాళ్లు యింట్లో లేరు. ఎక్కడికో మళ్లా ఉడాయించేసేరు.

ఆ సాయంత్రం బండికే బయల్దేరడానికి అన్నీ సర్దేస్తున్నారు అమ్మా నాన్న.

నాకు యిక్కడే యింకో రెణ్ణాళ్ళుండి చీనుతో, నానితో జట్టు కట్టాలని ఉంది. కాని అమ్మా నాన్నా ఒప్పుకొంటారా?

స్టేషన్‌కొచ్చి టికెట్టు తీసుకొని బండి ఎక్కేం. బండి కదిలేక అమ్మ అంటున్నది నాన్నతో:

'ఏమండోయ్ చూశారా. ఎంత డబ్బు ఉంటే ఏమిటి? ఒక్క పిల్లడు కూడ లేడు. మన బాబిగాణ్ని పెంచుకుంటానని మా తమ్ముడు ఒకటే గోల.'

నాకు ఆశ్చర్యంవేసింది. వాళ్లకి పిల్లలు లేరూ? మరి ఆ చీను, నాని ఎవరు? బహుశా ఆడపిల్లలు లేరేమో? ఆడపిల్ల లేకపోతే తనని పెంచుకోవడం ఏమిటి? తన కేమీ అర్థంకావటంలేదు.

అమ్మని అడుగుతే ఏం కోప్పడుతుందో? అడక్కుండా ఊరుకొందాం అంటే అర్థం కాలేదు.

అయినా ధైర్యంచేసి అడిగేశాను. 'అమ్మా అమ్మా చీను నానీ ఉన్నారుకదే వాళ్లకి పిల్లలు?'

'ఓరి చవటవాజమ్మా! చీను, నాని పిల్లలు కాదురా. పిల్లులు! ఎలకల్ని పట్టడంకోసం పిల్లుల్ని పెంచుతున్నారా' అని అంది.

నాకు ఆశ్చర్యంవేసింది - వాళ్ళ పిల్లలు పిల్లులా అని. ఎంత దర్జా బ్రతుకు వాటిది!

నా ఆశ్చర్యం ఆశ్చర్యంగానే ఉంది. బండి మాఊరి స్టేషన్‌లో ఆగింది.



# అర్ధరాత్రివేళ అజంతా ఏనుగు

ఇది కొన్ని వందల ఏళ్ళక్రిందట జరిగినకథ. ఆరోజుల్లో మన దేశంలో బౌద్ధ మతం బాగా వ్యాప్తిలో ఉండేది. అజంతాగుహల పేరు మీరు వినేఉంటారు. ఆగుహల ప్రాంతంలో వందలాది బౌద్ధభిక్షువులు ఉండేవారు. వారిలో గొప్ప చిత్రకారులు, కవులు, పండితులు ఉండేవారు. చిత్రకారులు అజంతా గుహాలలో గోడలమీద బౌద్ధ జాతకకథలు అద్భుతంగా బొమ్మలలో చిత్రించేవారు. వాటిని చూడడానికి, అక్కడి పండితులతో వేదాంతచర్చలు చేయడానికి దేశదేశాలనుండి యాత్రికులు, విద్వాంసులు వచ్చేవారు.

ఆ గుహాలకు సమీపంలో ఒక ఊరున్నది. దాని పేరు అజంతా. ఆఊరునుబట్టి ఆ గుహాలకు కూడా అజంతా గుహాలని పేరువచ్చింది.

ఆఊళ్లో ఒకసారి ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. ఊళ్లో అందరికీ యిళ్ళ వెనక చక్కని పళ్ళతోటలు ఉన్నాయి. పువ్వుల తోటలు ఉన్నాయి. కొద్దిరోజులనుండీ ఆ తోటల్లోకి రాత్రిళ్లు ఎవరోవచ్చి పాడుచేస్తున్నారు. ఒక్కొక్క రాత్రి ఒక్కొక్కరితోట పూర్తిగా పాడైపోతోంది. పళ్ళచెట్లన్నీ పెళ్ళగించి, పువ్వుల చెట్లన్నీ మట్టగించి నాశనంచేస్తున్నారు. ఏరాత్రి ఎవరి తోటమీదికి దొంగలు దండెత్తి వస్తారో అని గ్రామస్థులందరూ హడలిపోతున్నారు. రాత్రిళ్లు మేలుకుని కాపలాకాస్తున్నారు. చిత్రమేమిటంటే కాపలాకాసినంతసేపూ ఎవరూ రారు. కాస్త కన్నుమూత పడింతంటే చాలు, మరు నిమిషంలో తోటంతా నిశ్శబ్దంగా ధ్వంసమైపోయి కనిపించేది. ఈ దుండగం చేస్తున్నవారెవరైనదీ అంతు తేలటంలేదు.

ఇక ఆ ఊళ్లో ధ్వంసంకాకుండా మిగిలినది ఒక్కతోట. ఆతోట ఊరికి బాగా దూరాన ఉన్నది. చక్కని తోట. ఎన్నోరకాల వృక్షాలూ, పుష్పజాతులూ కళ్ళకు విందుగా పెరిగిఉన్నాయి. చిత్రకారుడు వేసిన అందమైనబొమ్మలాగ చూపరులనెంతో ఆకర్షించేది. దాని యజమాని ధనవంతుడు. అందుచేత అతడు ప్రతిరాత్రి బోలెడుమంది నౌకర్లను పెట్టి తోటలో కాపలా కాయిస్తున్నాడు. ఆ నౌకర్లు చాలా మెలకువగా కాపలా కాయటంచేత, దుండగులు ఎవరూ ఆ పరిసరాలకే రావడానికి వీలు లేకపోయింది.

ఇలా వరసగా అనేక రాత్రులు మేలుకుని గస్తీతిరగడంవల్ల కాపలాదార్లకు కళ్ళు కాయలుకాచి ఒక రాత్రి నిద్ర విపరీతంగా వచ్చింది. అంతా ఆ చెట్టుకింద, ఈ చెట్టుకింద పడుకుని నిద్రపోయారు.

కాని యజమానికొడుకు పది పన్నెండేళ్ళవాడు మాత్రం మేలుకుని మేడమీద తనగదికిటికీలోంచి చూస్తున్నాడు. అంతా నిశ్శబ్దంగా, చీకటిగా ఉన్నది. ఆ సమయంలో అతడికి దూరంగా ఏదో తెల్లని జంతువు రావడం కనిపించింది. అది తమ తోటవైపే వస్తున్నది. ఆ బాలుడు గాబరాపడి గబగబ తన తండ్రిని లేపాడు. యజమాని లేచి చూశాడు. అది ఒక పెద్ద ఏనుగు. ఎక్కణ్ణించి వచ్చిందో, ఎలా వచ్చిందో తెలియదు. ఆ ప్రాంతంలో ఎవరికీ తెల్లని ఏనుగులు లేవు. అసలు తెల్లని ఏనుగులు ఎవరూ, ఎక్కడా చూడలేదు. మరి ఇది ఎలా వచ్చింది? చాలా ఆశ్చర్యం కలిగింది. యజమాని వెంటనే నౌకర్లందరిని మేలుకొలిపాడు. కొన్ని వందల కాగడాలు క్షణంలో వెలిగించారు. తోట అంతా పట్టపగలులా ప్రకాశిస్తోంది. అందరూ కత్తులూ, కటార్లు, విల్లంబులూ ధరించారు.

తెల్లఏనుగు అప్పుడే తోట ద్వారాన్ని పడత్రోసుకుని లోపలికి వస్తోంది. ఒక్కసారిగా అందరు మనుషులను, కాగడాలను, విచ్చుకత్తులనూ చూసి ఏనుగు బెదిరిపోయింది. వెంటనే వచ్చినదోవనే వెనక్కి పరిగెత్తసాగింది. పాలేరుని సేవకులందరూ వెంటబడ్డారు. ఈ సందడికి ఊళ్లోజనంకూడా మేల్కొన్నారు. వాళ్లుకూడా ఆయుధాలు ధరించి, కాగడాలు వెలిగించి ఏనుగు వెంటబడ్డారు.

ఆ యేనుగు పరిగెత్తి పరిగెత్తి

# ★ అర్ధరాత్రివేళ అజంతా ఏనుగు ★

అజంతా గుహల దిక్కుగా పోయింది. అలాపోయి పోయి ఒక గుహలో జొరబడి మాయమై పోయింది.

వెంట పరుగెత్తుతున్న మనుషులందరూ నిర్ఘాంతపోయారు. ఇంతవరకూ తమకళ్ళయెదుటనే పరిగెత్తుతున్న ఏనుగు ఆ గుహలోకి జొరబడి ఎలా మాయమైపోయిందా అని ఆశ్చర్యపడ్డారు. ఆ గుహలో బౌద్ధ శ్రమణకులు కొందరు నివసిస్తున్నారు. వారిమధ్యకు ఈ యేనుగు ఎలా వెళ్ళింది?

సరే, అందరూ కాగడాలతో ఆ గుహలో ప్రవేశించారు. నిద్రపోతున్న సన్యాసులందరూ అలజడికి మేలుకొన్నారు. గ్రామస్థులు "ఇక్కడికేదైనా తెల్ల ఏనుగు వచ్చిందా?" అని ప్రశ్నించారు. "తెల్లఏనుగా? లేదే!" అని వారు తెల్లబోయారు.






ఇంతలో ఆ గుంపులోనుండి ఒక బాలుడు ముందుకు వచ్చాడు. అతడు ఇందాకటి తోటయజమాని కుమారుడే. అతడు గుహలో గోడలన్నీ పరీక్షగా చూసి హఠాత్తుగా "అదుగో, చూడండి, చూడండి" అన్నాడు.

ఎదురుగా ఒకగోడమీద తెల్లని ఏనుగు బొమ్మ ఉన్నది. ఆ యేనుగునుచూస్తే అచ్చంగా ఇందాకటి ఏనుగువలెనే ఉన్నది. అంతేగాదు, పరీక్షగా చూస్తే, పరిగెత్తిన ఆయాసంతో ఇంకా వగరుస్తూ ఉన్నట్లే కనబడింది. అందరూ ఆశ్చర్యపోయారు, గోడమీది బొమ్మ ఇంతపని చేసిందా అని.

నిజమే. ఆ యేనుగే ఇంతపని చేసింది. అందులో ఆశ్చర్యమేమీ లేదు. అది సామాన్యమైన చిత్రం కాదు. అనుపమాన సౌందర్యంతో, చైతన్యంతో అలరారుతూ ఉన్నది. సజీవమైన ఏనుగు ఏదీ ఉండనంత సజీవంగా ఉన్నట్లు, జీవకళ ఉట్టిపడుతూ ఉన్నది. ఆచిత్రం రచించిన చిత్రకారుడు ఎంత ప్రతిభాశాలియై ఉండాలి? అతని కుంచెలో, రంగులలో ఎంతగొప్ప శక్తి ఉండాలి? "ఎవరా చిత్రకారుడు?"

అని అందరూ ఒకేసారి ప్రశ్నించారు.

"ఇదుగో, ఇతడే" అని బౌద్ధసన్యాసులు ఒక యువకసన్యాసిని చూపించారు. అతడికి పాతికేళ్ళకంటె ఎక్కువ ఉండవు. అంతయావనంలోనే ప్రపంచసుఖాలన్నీ విసర్జించి, బౌద్ధమతం స్వీకరించాడు. అంత చిన్నతనంలోనే చిత్రలేఖనంలో గొప్పపాండిత్యం సంపాదించాడు. కృష్ణానదీతీరంనుండి వచ్చిన ఆంధ్రుడు. అజంతా విహారంలో నివసిస్తూ, గుహాగోడలమీద అపూర్వమైన శైలిలో బౌద్ధజాతక కథలను బొమ్మలుగా చిత్రిస్తున్నాడు.

గ్రామస్థులందరూ అతని నేర్పును పొగిడారు. కాని అతడు చిత్రించిన ఏనుగువల్ల తమకు జరుగుతున్న నష్టాన్ని కూడా తెలియజేశారు. ఎలాగైనా ఆ యేనుగునుండి తమ్ము రక్షించాలని వేడుకున్నారు.

చిత్రకారుడు కొంచెం ఆలోచించాడు, ఏంచేద్దామా అని. చివరికొక ఉపాయం తట్టింది.

తన కుంచెనూ, రంగులనూ తీసుకువచ్చి, గోడమీద ఉన్న ఏనుగుబొమ్మలో కొద్ది మార్పులు చేశాడు. ఏనుగుకాళ్ళను ఇనుపగొలుసులతో బలంగా బంధించివేసినట్లు చిత్రించాడు.

అంతే. ఇక ఆరోజునుంచీ ఏనుగు కదలడానికి, మెదలడానికి వీల్లేకపోయింది. గ్రామస్థులు అతనిసహాయానికి ఎంతో సంతోషించారు. కాని ఐరావతంలాంటి ఆ తెల్లని ఏనుగుమాత్రం తన స్వేచ్ఛకు భంగంకలిగించిన తోటయజమాని కొడుకుపై మహాకోపంతో మండిపడిపోయింది. దానికళ్లలో రౌద్రం కనిపించడానికి ఇదే కారణమని అంతా అంటారు. ★

# బార్బర్స్ బ్రిడ్జి

ఒక క్రొత్త మాట నలుగురి నోట్లో పడిందంటే కాల క్రమాన అది నాలుగువిధాలుగా మారి ఆఖరికి అసలు స్వరూపం లేకుండాపోతుంది. దీనికి ఉదాహరణగా ఒక జరిగిన సంఘటన ఉంది. మీరు ఎప్పుడైనా మద్రాసు వస్తే 'బార్బర్స్ బ్రిడ్జి' అనే పేరు వినే ఉంటారు. ఈ బ్రిడ్జి మద్రాసు బ్రిడ్జిలలోకల్లా చాల పాతది. ఇది బకింగ్ హామ్ కాలువపై ఉంది. దీని అసలు పేరు ఇది కాదు. ఆ కాలంలో 'హేమిల్టన్' అనే ఒక ఆంగ్ల ఇంజనీరు ఈ బ్రిడ్జి కట్టడానికి పూనుకొని చాలకాలం పని చేసి ఎట్టకేలకు పూర్తి చేసి, మద్రాసులో మొట్ట మొదట బ్రిడ్జి కట్టిన ఇంజనీరుగా పేరుగాంచాడు. ఆయన పనితనానికి మెచ్చుకొని, ఆయనను గౌరవించ దలచి ఆ బ్రిడ్జికి ఆయన పేరే పెట్టారు.

కొంతకాలంవరకు ఆ బ్రిడ్జి 'హేమిల్టన్ బ్రిడ్జి' అనే పేరుతోనే వ్యవహరించబడింది. ఆ కాలంలో ఇంగ్లీషుచదువులు లేవు కాబట్టి ఈ క్రొత్తపేరు వింతగా తోచింది. ఎవ్వరికీ ఈ క్రొత్తమాట ఉచ్చరించుట సరిగ్గా వచ్చేదికాదు. పోను పోను 'హేమిల్టన్' అనే పదం 'అంబట్టన్'గా మారింది. అరవంలో అంబట్టన్ అంటే మంగలివాడని అర్థం.

ఇక అప్పటినుంచి 'హేమిల్టన్ బ్రిడ్జి' అనేది పేరుపూర్తిగా మాసిపోయి 'అంబట్టన్ బ్రిడ్జి' లేక 'అంబట్టన్ వారావది' అని పిలువబడేది. దీనికితోడు ప్రమాదకారణంగా ఆ బ్రిడ్జిలో కొంతభాగం పడిపోయి పునాదిరాయి నీటిలో కొట్టుకుపోయింది. మళ్ళీ ఆ బ్రిడ్జిని మరామత్తు చేయదలచినప్పుడు "అంబట్టన్ బ్రిడ్జి" అని చెక్కిన రాయినే పునాదిరాయిగా ఉంచారు.

తర్వాత బ్రిటిష్‌ప్రభుత్వం పూర్తి అధికారంలోకి వచ్చినప్పుడు, ఆంగ్లేయులు 'అంబట్టన్' అనే మాటను సరిగ్గా పలకలేరు

**లింగం సుధాకర్**

గాబట్టి, 'అంబట్టన్' అనే పదానికి మంగలివాడని అర్థం తెలిసికొని, ఆ మాటను ఇంగ్లీషులోకి అనువదించి "బార్బర్స్ బ్రిడ్జి" అని పేరుపెట్టి పిలవసాగారు. ఇక అప్పటి నుండి ఆ బ్రిడ్జి రెండువిధాలుగా పిలవబడేది. అంటే కొంచెం ఇంగ్లీషు చదువుకున్నవారు 'బార్బర్స్ బ్రిడ్జి' అని, చదువుకోనివారు 'అంబట్టన్ వారావది' అని పిలిచేవారన్నమాట.

మఱి కొంతకాలానికి ఒక క్రొత్త అధికారి ఈబ్రిడ్జినిగుఱించి తెలిసికొని, దీనికి ఈ పేరు ఏ విధంగా పెట్టబడిందో తెలిసికోవాలనుకొని పాత 'ఫైల్సు' తిరగవేసేటప్పటికి అసలు బండారం బయట పడింది. 'హేమిల్టన్ బ్రిడ్జి' అనే పేరు పూర్తిగా మాసిపోయి 'అంబట్టన్ బ్రిడ్జి'గా మారటం, మఱలా అంబట్టన్ అనే పదాన్ని అనువదించి 'బార్బర్స్ బ్రిడ్జి'గా పేరు పెట్టడం జరిగిందని తెలిసికొన్నాడు. వెంటనే అతడు ఈ విషయంలో శ్రద్ధ తీసికొని పునాదిరాయిని పఱగొట్టించి "హేమిల్టన్ బ్రిడ్జి లేక బార్బర్స్ బ్రిడ్జి" అని చెక్కించి మఱొక క్రొత్త రాయిని వేయించాడు.

కాలక్రమాన విద్యాధికులు దేశంలో పెరుగుతూవచ్చినా అసలు పేరుతో ఆ బ్రిడ్జిని ఎవ్వరూ పిలవడంలేదు. జనసామాన్యమైన "బార్బర్స్ బ్రిడ్జి" అనే పేరుతోనే అది పిలవబడుతూంది. మనకు స్వాతంత్ర్యము వచ్చినతర్వాత కూడ ప్రభుత్వం దీనిని 'బార్బర్స్ బ్రిడ్జి'గానే గుర్తించింది. ఇది ఇప్పటికే కాదు, మరెప్పటికైనా "బార్బర్స్ బ్రిడ్జి" అనే పేరుతోనే పిలవబడుతుందనటానికి సందేహము లేదు. ★



"కుందన్" హిందీ చిత్రంలో సొహ్రాబ్ మోడీ.



బాక్సాఫీస్ చిత్రం "ఉరన్‌ఖటోలా" లో ఆంధ్రనటి సూర్యకుమారి, దిలీప్‌కుమార్.

# బొంబాయిసినిమా లేఖ

లండన్‌లో భారతీయ చలనచిత్రోత్సవం జూన్ 21 నుంచీ ప్రారంభం కానున్నది. ఆ సందర్భంలో బ్రిటిష్ ప్రేక్షకులకు కొన్ని మంచి భారతీయ చిత్రాలను, కొందరు ప్రముఖ భారతీయ నిర్మాతలను, తారలను చూసే అవకాశం కలుగుతుంది. ఝాన్సీకీరాణి, అమర్ భూపాలి, పరిణీత, మున్నా, బాబ్లా మొదలైన చిత్రాలు ప్రదర్శింపబడతాయి. నౌషద్ సంగీత ప్రతిభకు కొత్త నిదర్శనంగా వెలువడిన "ఉరన్ ఖటోలా" చిత్రం కూడా లండన్‌లో ప్రదర్శింపబడవచ్చు. ఈ చిత్రంలో మంచి సంగీతం ఉండడమేకాక టెక్నికల్‌గా కూడా అది అత్యుత్తమంగా ఉన్నది.

నిరూపరాయ్, నిమ్మి, మీనాకుమారి భారతీయ చలనచిత్రోత్సవానికి హాజరుకావచ్చును.

కథక్ నాట్యరాణి, మాజీ సినీతార అయిన సితారా అదే సమయంలో లండన్‌లో నృత్యప్రదర్శనాలిస్తుంది.

సొహ్రాబ్ మోడీ, ఆయన భార్య మెహతాబ్, శాంతారాం, ఆయన భార్య జయశ్రీ, కె. ఎ. అబ్బాస్, దిలీప్‌కుమార్, పి. కె. ఆత్రే కూడా లండన్ ఉత్సవానికి హాజరవుతారు.

* * *

సొహ్రాబ్ మోడీ తీస్తున్న "కుందన్" త్వరలో పూర్తికానున్నది. జాఁ వాల్ జాఁ పాత్రను మోడీ, అతడు పెంచుకున్న బాలిక పాత్రను నిమ్మి, ఆమె ప్రేమికుని పాత్రను సునీల్‌దత్ ధరిస్తున్నారు. ఈ చిత్రానికి ఆధారం విక్టర్ హ్యూగో రచించిన నవల. భారతీయ వాతావరణానికి అనువుగా దేశకాల పాత్రలు మార్చబడినవి. 1942 లో మహాత్మాగాంధీ నాయకత్వాన జరిగిన స్వాతంత్ర్య సమరం ఈ చిత్రానికి వాతావరణంగా ఉపయోగించబడుతున్నది.

* * *

శాంతారాం తన మొదటి టెక్నికలర్ చిత్రం "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" పూర్తి చేశారు. నృత్యాలతో, సంగీతంతో

# బొంబాయి సినిమా లేఖ

నిండిన ఈ చిత్రంలో కాళిదాస మహాకవి రచితమైన కుమారసంభవంనుండి కొన్ని ఘట్టాలను ఏరి ప్రవేశపెట్టారు. సంధ్య, గోపీ కిషన్‌ల నృత్యాలు ఈ చిత్రానికి ప్రత్యేకాకర్షణలు.

*      *      *

బొంబాయిలో వేసగితాపానికి తట్టుకో లేని వారలు చల్లని ప్రదేశాలకు పోవడానికి ప్రయత్నిస్తున్నారు. కాని చాలమంది పని ఒత్తిడిమూలంగా కదలలేక పోతున్నారు. అటువంటివారు సాయంత్రాలప్పుడు ఇక్కడి సముద్రపుగాలితోనే తృప్తి పడుతున్నారు.

భారత్‌భూషణ్ మహాబలేశ్వర్‌లో కొన్నాళ్లు విశ్రాంతిగా కాలంగడిపి తిరిగి బొంబాయి వచ్చాడు. అతనికి తీన్‌భాయ్, అమానత్, లైలామజ్నూ చిత్రాల్లో పని ఒత్తిడి బాగా ఉన్నది.

మీనాకుమారికూడా భర్త కమాల్ అమ్రోహితో కలిసి మైసూరు వెళ్ళినది. కమాల్ తను తీయబోయే కొత్తచిత్రానికి స్క్రిప్టును అక్కడే పూర్తిచేసుకుని తిరిగి వస్తాడు.

*      *      *

ఈమధ్య బొంబాయిలో కొత్తగా విడుదలయినచిత్రాలు "సితారా" "హాహా హీహీ హూహూ" "నకబ్".

'సితారా' లో వైజయంతీమాల నటించింది. నిర్మాత ఎస్. కె. ఓఝూ. ఫిలిం జీవితాన్ని చిత్రించే ఈ చిత్రంలో కథ బాగానే ఉన్నా సంగీతం పాడుగా ఉండడంచేతా, వైజయంతీమాల బాగా నటించలేకపోవడంచేతా ఈ చిత్రం సుమారుగా ఉన్నది.

'హాహా హీహీ హూహూ' నృత్య సంగీత హాస్య చిత్రం. సంతోషి తీసిన ఈచిత్రంలో దృశ్యాలు బాగానే ఉన్నాయి. కాని ప్రొడక్షన్‌విలువలు, ఫొటోగ్రఫీ పూజ్యంగా ఉండడంవల్ల రాణించలేదు.

'నకబ్' లో మధుబాల, షమ్మీకపూర్, అజిత్, ఆశామధుర్ నటించారు. అరేబియన్ వాతావరణపు కథ. ఏమీ బాగా



బొంబాయిలో "ఉరన్‌ఖటోలా" విడుదలఅయినప్పుడు తీసినఫొటో: నిమ్మి, నౌషద్, రికార్డిస్ట్ రబీన్‌చటర్జీ.

లేదు. దర్శకత్వం, ట్రీట్‌మెంట్, పాత్ర చిత్రణం వగైరాలు అసందర్భంగా ఉన్నాయి. సంగీత దర్శకత్వం బాగానే ఉన్నదికాని ప్లేబాక్ కంఠాలు ఘోరంగా ఉన్నాయి. ★

# అమెరికాలో చలన చిత్ర పరిశ్రమ

అమెరికాలో ఏడు పెద్ద ఫిలిం కంపెనీ లున్నాయి. ఈ ఫిలిం కంపెనీలలో ప్రతిదానికీ స్వంతస్టుడియో వుంది. అటువంటి పెద్దకంపెనీలు ఇవి: కొలంబియా, మెట్రో-గోల్డ్విన్ - మేయర్, పేరమౌంట్, ఆర్ కె ఓ-రేడియో, ట్వెంటియత్ సెంచరీ-ఫాక్స్, యూనివర్సల్ ఇంటర్నేషనల్, వార్నర్ బ్రదర్స్. ఈ కంపెనీలవారందరికీ అమెరికా చలన-చిత్ర నిర్మాతల సంఘంలో సభ్యత్వముంది. ఇవిగాక, స్వంత స్టుడియోలున్న స్వతంత్ర సంస్థలు మూడున్నాయి. అవి: మోనోగ్రామ్, రిపబ్లిక్, యునైటెడ్ స్టేట్స్.

1953 వ సంవత్సరపు వివరాలు ప్రస్తుతం అందుబాటులో వున్నాయి. ఆ సంవత్సరంలో 354 ఫిలిములు నిర్మించబడినాయి. వీటిలో 273 ఫిలిములను ఏడు పెద్ద కంపెనీలే నిర్మించాయి. 81 చిత్రాలను ఇతర కంపెనీలు నిర్మించాయి. మొత్తం ఫిలిములలో 68 ఫిలిములు విదేశాలలో 'షూట్' చేయబడినాయి.

1954 లో అమెరికాలో 15,040 సినిమా హాలులున్నట్లు చలన చిత్ర నిర్మాణసంస్థల సమితివారు ఇటీవల జరిపిన దరియాప్తువల్ల తేలింది. వీటికి తోడు ఆ సంవత్సరంలో 4,062 'ఓపెన్ - ఎయిర్, డ్రైవ్ - ఇన్ థియేటర్లు వున్నాయి.

1954 లో అమెరికాలోని అన్ని థియేటర్లకు ప్రతిరోజూ సగటున హాజరయిన ప్రేక్షకులు 1,25,00,000 మంది.

ఇండియాలో వున్న మాదిరి కేంద్రప్రభుత్వ ఫిలింసెన్సార్ బోర్డు అంటూ ఏదీ అమెరికాలో లేదు. అయితే, చలన చిత్ర నిర్మాతల సంఘంవారు ఐచ్ఛికంగా ఏర్పాటుచేసుకున్న 'చిత్ర నిర్మాణ నియమావళి' అంటూ ఒకటి వుంది. ఈ నియమావళి 1930 లో రూపొందించబడింది. చలన చిత్ర నిర్మాతలసంఘం అమెరికాలోని చలన చిత్ర నిర్మాతలందరకూ ప్రాతినిధ్యం వహిస్తున్నది. అమెరికాలో ప్రదర్శించబడుతున్న విదేశీ-చిత్రాలుకూడా ఈ సంఘ నియమాలకు లోబడేట్లు చేయబడుతున్నాయి.

## ☆ అమెరికాలో చలనచిత్ర పరిశ్రమ ☆

చలనచిత్ర ప్రేక్షకుల నైతిక ప్రమాణాలను తగ్గించేదిగా గాని, శాసనోల్లంఘనపట్ల వారిలో సానుభూతిని కలిగించేదిగాగాని ఏ చిత్రమూ వుండరాదనేది ఈ "చలన చిత్ర నిర్మాణ నియమావళి" లోని ముఖ్యసూత్రం.

అయితే, ఈ నియమాలకు కట్టుబడి ఫిలిం నిర్మాణం జరుపవలసిందని అమెరికాలో ఎవ్వరినీ బలవంతపెట్టరు. కాని, ఫిలిం నిర్మాతలందరూ వీటిని తమకు తాముగానే పాటిస్తూ వుంటారు. పౌరులపట్ల ఫిలిం నిర్మాతలకు గురుతరమైన బాధ్యత వుందని అనేక సమావేశాల్లో అనేకమంది హెచ్చరించి, అటువంటి బాధ్యతలు తమపైనున్నట్లు ఫిలిం నిర్మాతలు గ్రహించేటట్లు చేశారు.

అయితే, చాలా రాష్ట్రాలలో ఫిలిం సెన్సార్ బోర్డు లున్నాయి. ఫిలిములను ప్రదర్శించడానికి అనుమతి నిచ్చేముందు ఈ సెన్సార్ బోర్డువారు వాని ప్రదర్శనార్హతను పరీక్షిస్తారు.

పత్రికను, ఫిలిములను రాష్ట్ర ప్రభుత్వాలు కాని, కేంద్రప్రభుత్వం కాని సెన్సారు చేయడాన్ని అమెరికా ప్రజలు ఒక పట్టాన ఒప్పుకోరు. 'ది మిరకిల్' అనే ఇటలీదేశ చిత్రం 'దైవ దూషణ పూరితంగా' వుందని చెప్పి న్యూయార్క్ సిటీ కోర్టువారు కొద్ది సంవత్సరాల క్రిందట నిషేధించారు. అయితే, అమెరికా సుప్రీమ్ కోర్టువారు ఈ నిషేధాన్ని ఎత్తివేశారు. ఈ సందర్భంలో ఇవ్వబడిన తీర్పు చాలా ముఖ్యమైన తీర్పులలో ఒకటిగా భావించబడుతున్నది. ఆ తీర్పులో సుప్రీం కోర్టువారిలా ఉద్ఘాటించారు.

'వాక్ స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యాల విషయంలో రాజ్యాంగ చట్టంలో ఏయేమి హామీలైతే ఇవ్వబడివున్నాయో ఆ హామీలన్నీ చలనచిత్రాలకు కూడా అనువర్తిస్తాయి.'

★

## "కన్యాదానం"

విశాల్ ప్రొడక్షన్స్‌వారు తమ 'కన్యాదానం' చిత్రానికి రెండుపాటలు ఇటీవల రికార్డుచేశారు. ఈ పాటలు కొసరాజు వ్రాశారు. ఇవి నృత్యగీతాలు. వీటికి వహీదా రహమాన్ నృత్యం చేస్తుందని తెలుస్తున్నది.

* * *

ప్రకాశ్ పిక్చర్స్‌వారి "అంతేకావాలి" ఈ 16వ తేదీనే విడుదల కాగలదని ప్రకటించబడింది.

* * *

ఈనెల 1వ తేదీన త్యాగరాయనగర్, పాండీబజార్‌లో జైహింద్ స్టూడియో అనే ఫొటోగ్రఫిక్ స్టూడియో తెరువబడినది. దర్శకుడు పి. పుల్లయ్యగారు ప్రారంభోత్సవం చేశారు. కీ. శే. గూడవల్లి రామబ్రహ్మం, కీ. శే. ఘంటసాల బలరామయ్యగార్ల ఛాయాచిత్రాలను చల్లపల్లి రాజావారు ఆవిష్కరించారు. ఎస్. వి. ఎస్. రామా



"కన్యాదానం" లో సురభి బాలసరస్వతి, రమాదేవి, సి. ఎస్. ఆర్.

భాస్కర్ ప్రొడక్షన్స్‌వారి "చెరపకురా - చెడేవు!" లో రేలంగి.

రావుగారు కెమెరా 'క్లిక్' చేశారు. ఆ సందర్భానికి పలువురు సినిమా ప్రముఖులు హాజరయ్యారు.

* * *

ఎ. వి. ఎమ్. వారు 'చోరీచోరీ' 'భాయ్ భాయ్' హిందీ చిత్రాల నిర్మాణం ప్రారంభించారు. 'చోరీ చోరీ'లో నటించే నర్గీస్, రాజ్ కపూర్, డేవిడ్, భగవాన్ ఈ సందర్భంలో మద్రాసు వచ్చారు.

* * *

## 'ఒమర్‌ఖయ్యాం'

హాలీవుడ్, పారమౌంట్ కంపెనీవారు ఒమర్ ఖయ్యాం జీవితచిత్రాన్ని విస్టావిజన్ టెక్నికర్‌లో నిర్మించనున్నారు. ఈ చిత్రాన్ని తమదేశంలోనే నిర్మించమని పర్షియా ప్రభుత్వం పారమౌంట్ వారిని ఆహ్వానించిందట.

* * *

హెల్సింకీనగరంలో జరిగే ప్రపంచశాంతి మహాసభకు దిలీప్ కుమార్, కె. ఎ. అబ్బాస్, పి. కె. ఆత్రే హాజరు అవుతారట. అక్కడినుండి వారు రష్యాకూడా వెళ్లవచ్చునట.

* * *

## సినిమా రచయిత కీ॥ శే॥ తోలేటి వెంకటరెడ్డిగారు

తెలుగు సినిమా రచయిత తోలేటి వెంకటరెడ్డిగారు ఈనెల 7వ తేదీ ఉదయం ఆకస్మికంగా హృద్రోగంవలన మరణించారు. వీరి జననం 1917. 6గురు పిల్లలున్నారు. 1947 లో తొలిసారిగా సినిమాలలో ప్రవేశించారు.

ఎ. వి. ఎమ్. వారి చిత్రాలు చాలా వాటిలో వీరు తెలుగు సంభాషణల రచయితగా పనిచేశారు. వీరు సంభాషణలు వ్రాసిన 'జీవితం' చిత్రం అఖండ విజయం పొందింది. మొత్తం పదిచిత్రాల్లో రెడ్డిగారు పనిచేశారు. ఇప్పుడు సేలం, మోడరన్ థియేటర్స్‌వారి 'ఆలీబాబా' చిత్రానికి, 'సదారాం' అనే మరో కన్నడ చిత్రం తెలుగు తర్జుమాకు పనిచేస్తున్నారు. ఆ క్రితం రోజు రాత్రే వీరు సేలంనుంచి తిరిగివచ్చారు. తెల్లవారినతరువాత మామూలుగా మాట్లాడుతూనే ఆకస్మికంగా హృదయచలనం ఆగి మరణించారట.

వీరి మృతికి సంతాపం వెల్లడిస్తూ ఆంధ్ర స్క్రీన్ రైటర్స్ గిల్డ్ వారు ఒక తీర్మానం చేశారు. వెంకటరెడ్డిగారి కుటుంబానికి మా సానుభూతి.





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, ThambuChetty St Madras



"పువ్వు పూసింది"

ఫొటో :- కె. జి. గోపాలకృష్ణమూర్తి—శాస్త్రి